కలి ప్రభావితులైన
పాపకర్ములైన
మానవులకు కైవల్యము
ప్రసాదించి
ధర్మప్రతిష్ఠాపనకై
వెలసిన
శ్రీమహావిష్ణువు
కళ్యాణగాథ!

రామకృష్ణా సినీ స్టూడియోస్
సమర్పించు

# శ్రీతిరుపతి వేంకటేశ్వర కళ్యాణం

వర్ణచిత్రం

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: **యన్.టి.రామారావు** బి.ఏ.,

గుర్తుంచుకోండి—

**తల్లి పాలు అన్నిటికన్నా ఉత్తమం**

ప్రకృతి యిచ్చే యీ వరానికి బదులుగా మరొకటి లేదు. అందుకే, వీలైనంత వరకూ పాపకు మీ పాలే యివ్వండి. అయితే, మీరిచ్చే చనుబాలు గనక సరిపోకపోతే, అమూల్‌స్ప్రే యివ్వడం మొదలెట్టండి.

**మొదటి నుంచీ అమూల్‌స్ప్రే యివ్వండి—అన్నిటికన్న ఆదరణ పొందిన శిశు ఆహారం**

అమూల్‌స్ప్రేకి దానికి తాగల ప్రత్యేకతలు:

- ఖచ్చితంగా సంతులితమైనది
- విటమినులతో నిండినది
- సులభంగా జీర్ణమౌతుంది
- సులభంగా కరుగుతుంది






# అమూల్‌స్ప్రేతో అభివృద్ధి మొదలౌతుంది దానిని బాల్‌అమూల్ పరిపూర్ణం చేస్తుంది






## 3వ నెల నుంచీ

**బాల్ అమూల్ కూడా యివ్వండి అత్యంత పుష్టికరమైన, పాలతో కలిసిన సీరియల్ ఆహారం**

3వ నెలనుంచీ, పాప ఎంతో వేగంగా పెరుగుతాడంటే, పాప పుట్టినప్పటికన్నా రెట్టింపు అవుతుంది, మరి తొలి ఏళ్ళలో పాప మెదడు 80% దాకా వృద్ధి చెందుతుంది. అందుకే కేవలం పాలు మాత్రం యిస్తే చాలదు. పాపకు ప్రోటీను, విటమినులు, ఖనిజ పదార్థాలూ ఎక్కువగా, అవీ బాగా సంతులితమైన రూపంలో అందాలి. అవి కేవలం బాల్ అమూల్‌లోనే అన్నిటికన్న ఉత్తమమైన రూపంలో లభిస్తాయి.

**బాల్ అమూల్ మన దేశంలోని శిశువుల కోసం ప్రత్యేకంగా తయారైంది.**

బాల్ అమూల్, సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారి సహాయంతో—వెల్లూరి క్రిస్టియన్ మెడికల్ కాలేజీవారిచే పరీక్షించబడినది.

**బాల్ అమూల్‌లో మరింత పోషణ గల విలువ.**

- ప్రాంతీయ దేశీయ అవసర మన ఆహారం, సీరియల్ ఆహారాల కంటె కనీసం 25% హెచ్చు ప్రోటీను.
- మరింత హెచ్చు కాల్షియం, విటమిన్ ఎ మరియు డి
- కొవ్వు పదార్థాలు, ఇనుము మరియు విటమిన్ బి కాంప్లెక్స్‌తో యిది పటిష్టం చేయబడినది.
- ముందుగానే పాలతో వండబడినది, తేలికగా అరుగుతుంది, రుచికరమైనది.
- పప్పు, పండ్ల గుజ్జు, పుడ్డింగ్ మొదలైన వాటితో సులభంగా కలుస్తుంది.

**బాల్ అమూల్‌తో మీరిచ్చే ఖర్చుకు రెట్టింపు విలువ అందుతుంది.**

ASP-AB-5/79

**ఉచితం:** సమాచారం గల అమూల్ బేబీ బుక్ మరియు బాల్ అమూల్ గ్రోత్ రికార్డ్ బుక్‌లెట్ ఇంగ్లీషులోనూ, అమూల్ బేబీ బుక్ హిందీ, తమిళం, తెలుగు మరియు మలయాళంలో కూడా దొరుకుతుంది. వాటి కోసం పోస్టు బాక్స్ నం 10124, బొంబాయి 400 001 కి మీ పూర్తి చిరునామాతో బాటు రూ. 1.00 పోస్టేజి స్టాంపులను పంపండి.



విక్రయదారులు: గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 26-10-'79
సిద్ధార్థి నామ సం॥ కార్తీక శు॥ పంచమి
సంపుటము 73 · సంచిక 9

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం. విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
"నరకాసుర వధ"
[చిత్రం : శ్రీ [illegible]]





# ఛాంపియన్ డిటర్జంట్ కేక్ !

# 1అప్

మరింత
తెల్లదనంతో
మీకు
విజయం!




మీకు
డబ్బులో
మరింత
ఆదా!



అధిక తీవ్రంగా పని
చేసే నురుగ, అధికంగా
తెలుపుచేసే పదార్థాలతో
శక్తి. దాంతోపాటు శుభ్రతతో
పాటు తెల్లదనాన్ని
యిస్తుంది మీకు వన్-అప్.
దాంతో తెల్లవాటికి మరింత
తెలుపు. రంగువాటికి
మరింత మెరుపూ వస్తుంది.



వన్-అప్, మరే ఇతర
డిటర్జంట్ కేక్ కన్నా
ఎక్కువకాలం మన్ను
తుంది. ఎందుకంటే,
వాడగానే తొందరగా ఆరి
పోతుంది గనక. అంటే
ఉతికే ప్రతిసారీ మీరు
డబ్బును ఆదా
చేస్తున్నారన్నమాటే!




తెల్లదనానికి మీ పాలిట ఛాంపియన్!

ASP/WL-1UP 2R

విట్కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.

# మనలో మాట

అందరికీ మా దీపావళి శుభాకాంక్షలు! పై వారం సంచికని కూడా "దీపావళి" ముఖచిత్రం తోను, పోటీలో ఎన్నికైన చివరి రెండు కథలతోను "ప్రత్యేక సంచిక" గానే వెలువరించనున్నాము.

* * *

దీపావళికి నిర్వహించిన కథల పోటీలో "సంపాదకుని ఎన్నిక"లో ఒక్కొక్కటి రూ. 600 లు వంతున బహుమతులు పొందిన ఐదు కథల పేర్లు యిక్కడ యిస్తున్నాము.

★ నిజం ★ సెటిల్మెంట్ ★ ఫలివన్నె మేక ★ హృదయం ★ పెద్దకొడుకు.. ఇక యీ రచయితల పేర్లు, విశేషాలు పాఠకుల "బ్యాలట్" నిర్వహించిన తరువాత, ఆ ఫలితాలతోనే వేస్తాము. పాఠకులకు తెలుసు— పై వారంతో ఐదు కథల ప్రచురణ పూర్తి అవుతుంది— కనుక బ్యాలట్ పత్రం పై సంచికలోనే వేస్తాము. పాఠకుల "బ్యాలట్"లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన కథలకు, ఆ వరుసలో రూ 600 లు. రూ 500 లు. రూ 400 లు. వంతున అదనపు బహుమతులు యిస్తాము— మిగిలిన రెండు కథలకూ రూ 250 ల వంతున కన్సొలేషన్ బహుమతులను అందజేస్తాము. ఈ రచయితలకు పోటీలో పాల్గొన్న యితర రచయితలకు కూడా మా అభినందనలు, శుభాకాంక్షలు!

* * *

ఈ వారం నుంచి కొత్త సీరియల్ "సుదూర తీరాలు" ప్రారంభిస్తున్నాము— 'ప్రేమపాశం' నవల అయిపోగానే హాస్యరచన "ప్రాక్టీసు పెట్టినాడు..." సీరియల్‌ని వ్యంగ్య చిత్రాలతో వేద్దామనుకుంటున్నాము.

* * *

ఈ వారం దీపావళి కథల సంచిక గనుక మామూలు శీర్షికలు కొన్ని ఉండకపోవడం సహజమే... పాఠకులు గమనించగలరు.



## లోక్‌నాయక్ అస్తమయం



సంపూర్ణ విప్లవ ప్రబోధకుడు సర్వోదయవాది శ్రీ జయప్రకాశ్ నారాయణ్ అక్టోబరు 8వ తేదీ ఉదయం గం. 5-45 కి పాట్నాలోని తమ నివాసంలో అంతిమ శ్వాసను విడిచారు. ఈ మహానాయకుని అస్తమయం భారత జాతికి తీరని ఆవేదనని, లోటుని కలిగించింది

# హార్లిక్స్




## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్లయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండా తట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణ-మయిన ఆరోగ్యం చేకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.
అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది.

సుచిత్ర మొస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసి చేస్తున్నాను"



**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టర్ ట్రేడ్ మార్క్.

# పులి వన్నె మేక







**దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన కథ**

ఆ ఎస్సై పేరు చెబితే ఆ ఏరియా వారికి హడలు. ఎజ్డీమీద కూర్చొని టాప్ గేర్‌లో వస్తుంటే ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చిప్. ఆ స్టేషన్ ఏరియాలో అతడిని చాటుగా పిలిచేపేరు టైగర్. పెద్ద కళ్ళద్దాలతో, బొద్దు మీసాలతో, ఖాకి డ్రస్సును టక్ చేసుకొని హుందాగా నడిచే ఆ పెద్దమనిషి నిజంగా టైగర్ లాగే వుంటాడు. (సివిల్ డ్రస్సులో వున్నప్పుడు ఒంటిమీద చారల చొక్కా వున్నా, నాలుగు కాళ్ళు మాత్రం లేవులెండి.)

'ఊం.. కొడకా' అని తిడుతూ నేరస్థుల వీపుల మీద బూట్ల కాళ్ళతో తంతూ వాళ్ళ చేత నిజం చెప్పించేటప్పుడు వారి పాలిట పులేకాదు, యముడు కూడా. అతడెక్కడ పనిచేస్తే అక్కడ దొంగతనాలు తక్కువగా జరగవని ప్రతీతి. నేరస్థులకే కాదు, మంచి వారికి కూడా చాలా కఠినంగా కనిపిస్తాడు. చాలా దురుసుగా ప్రవర్తిస్తాడు. తన సబార్డినేట్స్‌ను గడ్డిపోచల్లా చూస్తాడు. అతడంటే అందరికీ హడలే. చాటుమాటుగా అతడినందరూ తిట్టుకుంటారు.

ఇక ఆయన కేరక్టర్ లోనికి వెళ్దాం: రక్షక భటులను భక్షక భటులని పిలిస్తే బాగుంటుందనిపించే యీ రోజుల్లో చాలా కొద్దిపాటి నిజాయితీపరుల్లో అతడొకడని చెప్పుకోవచ్చు. అంచేతనే గామోలు ప్రమోషన చాలా లేటుగా (అంటే రిటైర్ కావడానికి ఏడాది మాత్రం వుండగా) వచ్చింది. నీ వంటి బ్రతుక నేర్వనివాడు యిక్కడెక్కడా వుండడానికి వీలేదంటూ దండకారణ్యానికి విసిరికొట్టేరు. తానక్కడ పని చేయబోయేది కొద్ది రోజులు మాత్రమే. ఆ కొద్ది రోజుల కోసం కుటుంబాన్నంతా తీసుకు రావడం వారితో పాటు సామాన్లన్నీ మోసుక రావడం యిష్టంలేక, తానొక్కడే కొద్దిపాటి వస్తువులతో వచ్చిచేరేడు. ఈ కొద్ది రోజులకు అధికారుల కాళ్ళందుకు పట్టుకోవాలని ట్రాన్స్‌ఫర్‌కు ప్రయత్నించకుండా విసిరేసిన ఏరియాలోనే విహరిస్తున్నాడు.

* * *

స్టేషన్ ప్రశాంతంగా వుంది. గేటు దగ్గర గిరీశం కునికిపాట్లు పడుతున్నాడు. తన సింహాసనం మీద కూర్చొని ఎదురుగా కనిపిస్తున్న ఎత్తు కొండల వైపు చూస్తున్నాడు టైగర్ గజపతి. రెండు కొండలు వాటి నడుమ చిన్న లోయ. చెట్లతో గుబురుగా వుంది ఏటవాలు ప్రాంతంలో కొంత భాగం చదును చేసి మొక్కజొన్న నాటేరు. ఏపుగా పెరిగింది చేను. లోయలో నుండి నీటి ప్రవాహం. ప్రకృతి కనుల కింపుగా వుంది.

గజపతి ఆలోచనలో పడ్డాడు. తాను ఆ స్టేషన్‌కు వచ్చి ఆరు నెలలు కావస్తుంది. రెండు నెలల నుండి ఏలాంటి గొడవలూ లేవు. కాని రాత్రి మాత్రం జరిగింది దొంగతనం. ఐదు తులాల బంగారం, రెండొందల నగదు పోయాయి ఆ వూరి షావుకారు యింట. ఇంటాయన కుటుంబంతో సహా చుట్టరికానికి వెళ్ళిన అదును చూసుకొని, ప్రహరీ దూకి వెనుక తలుపులు విరగ్గొట్టి యింట్లోనికి ప్రవేశించేడు దొంగ. తెల్లవారిన తర్వాత విరిగిన తలుపులు చూచిన వారు పోలీసు రిపోర్టు యిచ్చేరు. విషయం షావుకారుకు చేరవేసేరు. అతడు లబో దిబోమంటూ వూరు చేరుకున్నాడు.

అదే సమస్య గజపతి మెదడును తొలుచుకు తింటుంది. నేరస్థులను పట్టుకొని గట్టిగా శిక్షించకపోతే దొంగతనాలు ప్రబలిపోవచ్చు. ఆ ప్రయత్నంలోనే ఉదయం



నుండి తిరిగి తిరిగి అలసిపోయాడు. జవాను లంతా పూరిమీద పడ్డారు.

"ఒరేయ్ గిరి" పిలిచాడు గజపతి విశ్రాంతం పొందుతున్న గిరీశం బదులు పలక లేదు.

"ఒరేయ్ గాడిదా?" గర్జించేడు.

"యస్సర్" తడబడుతూ సెల్యూట్ కొట్టి ఎటెన్షన్‌లో నిలబడ్డాడు గిరీశం.

"కునుకు తీస్తున్నావా?"

"యస్సార్.. లే... లేదుసార్."

"మరేం చేస్తున్నావు?"

"మరే... మరే... రాత్రంతా నిద్ర లేదుసార్."

"వుద్ధరించేవు."

"యస్సర్."

"నువ్వే వుద్ధరించేవా?"

"లే... లేదుసార్."

"నువ్వీ వూరికొచ్చి ఎన్నేళ్ళయింది?"

"మూడు సర్!"

తల పంకించేడు గజపతి. "ఈ మూడు సంవత్సరాలలో ఎన్ని దొంగతనాలు జరిగినై?" ప్రశ్నించేడు.

"ఏమోసార్"

"యూ రాస్కెల్... ఆలోచించి చెప్పు"

"ఇరవైకి పైగా జరిగి వుండొచ్చు సార్". గజపతి సిగరెట్టు వెలిగించి, గట్టిగా దమ్ము లాగేడు. మెదడు నిండా ఆలోచనలు ముసురుకొంటున్నాయి.

"ఎన్ని దొంగతనాలలో దొంగల్ని పట్టగలిగేరు మనవాళ్ళు?"

"ఐదో, ఆరో కేసుల్లో దొంగల్ని పట్టుకున్నాంసార్" బదులిచ్చేడు గిరీశం.

"పాత దొంగల లిస్టు తీసుకురా" తెచ్చేడు గిరీశం... జోగులు, వెంకడు, రుద్రయ్య... మొదలైన పేర్లున్నాయి అందులో.

"వీళ్ళంతా వున్నారా వూర్లో? ఈ విషయం అర్జంటుగా తీసుకొనిరా" అంటూ గిరీశంను పంపించి, ఆలోచనలో మునిగిపోయాడు గజపతి. దొంగతనం జరిగిన ప్రదేశం పరిశీలిస్తే, నేర్పుగలవ్యక్తి పనే అనిపిస్తుంది. క్రొత్తవాడు అంత సాహసం చేయలేడు. సాహుకారు వూర్లో లేనట్టు ముందే తెలిసి వుండాలి. నిన్నటి దినం క్రొత్తవాడెవరూ వూర్లోకి వచ్చినట్టులేదు. కాబట్టి యిది నూరి వాడి పనే అయివుండాలి. పాత దొంగల్లో ఎవడో యీ పని చేసి వుండాలి.

గిరీశం తీసుకొచ్చిన వివరాలు బట్టి అందరూ వూరిలోనే వున్నారు గాని, రుద్రయ్య మాత్రం ఎక్కడికో వెళ్ళేడు.

రుద్రయ్య వూర్లో లేడు. ఎందుకు లేడు? ఎక్కడికి వెళ్ళేడు. బహుశా అతడే దొంగేమో!

"గిరీ" గర్జించేడు గజపతి

"యస్సార్" వణుకుతూ నిలబడ్డాడు గిరీశం.

"చుట్టుపట్ల వూర్లన్నీ వెతికి రుద్రిగాడిని తీసుకురా" కఠినంగా వుంది ఇన్స్పెక్టర్ గొంతు.

"యస్సర్" గొణుక్కున్నాడు గిరీశం.

* * *

"దండాలు బాబూ పిలిపించారట" అంటూ గేటు దగ్గర నిలబడ్డాడు రుద్రయ్య. బక్కగా వున్నాడు చిరిగిన బనీను, గావంచా కట్టుకొని వున్నాడు. జుట్టు రేగి వుంది. కళ్ళు లోతుకుపోయి వున్నాయి. నడి వయసులో వున్నాడు.

"లోపలికి రా. నీ కోసమే చూస్తున్నా" అంటూ మొలకున్న బెల్టును తడుముకొని నిలబడ్డాడు గజపతి. రుద్రయ్య లోనికి వచ్చేడు.

"నిన్న వూర్లో లేవుకదా. ఎక్కడికి వెళ్ళేవు?" ప్రశ్నించేడు గజపతి.

"ఏడ్డు అమ్మకానికి సంతకు పోయినా దొరా" బెదురుతూ బదులు పలికేడు.

"ఆహా! ఎంత కమ్మినావు?"

"రెండొందలొచ్చినాయి దొరా. ముసిలెద్దులు. పనికి పనికిరావు. ఎంతకొస్తే అంతే సాలని అమ్మిసారేసినా."

"ఆహా! మొన్న రాత్రి నువ్వెక్కడున్నావు?" గతుక్కుమన్నాడు రుద్రయ్య.

"యింట్లోనేవున్నా దొరా" బదులిచ్చేడు.

"సాహుకారు యింట దూరిందీ నువ్వేనట" వ్యంగ్యంగా పలికేడు గజపతి.

"నీ కాల్మొక్తా దొరా. నేనేకర్మ ఎరగ"

"ఎరగవా?... నీకెలా తెలుస్తుంది?... నాలుగంటిస్తే అన్నీ బైటపడతాయి."

"దండం దొరా! నేను దొంగతనం సెయ్యనేదు"

బెల్టుతో రుద్రయ్య శరీరం మీద నృత్యం చేసింది - వీపు వాతలు తేరింది. గజపతి కళ్ళు నిప్పులు కురుస్తుంటే రుద్రయ్య శరీరం వణుకుతుంది.

"దొరా .. దొరా... దండం దొరా ... నే నెరగ దొరా...నే నెరగ..."

"రాస్కెల్ నువ్వే చేసావు దొంగతనం. ఇలానే నీ ప్రాణం తీస్తా. నిజంచెప్పు..." గర్జించేడు గజపతి. బెల్టు రుద్రయ్య మీద కురిసింది.

"నేనే దొరా నేనే దొరా..." రుద్రయ్య అంగీకరించేడు. బెల్టు శాంతించింది. గజపతి ముఖంలో విజయగర్వం తొణికిసలాడింది.

* * *

యాభై అయిదేళ్ళ వయసు పూర్తి కావడంతో రిటైర్మెంట్ ఆర్డరు వచ్చింది గజపతికి. రుద్రయ్య కేసు కోర్టుకెక్కించేడు.

ఏముంది! దీపావళికి టపాసులు కొంటున్నాం అని ఒళ్ళుళ్ళం ఉలిక్కిపడేను - 'మేం కొనము' అంటూ ఒకటే అల్లరిచేస్తే





# పులివన్నె మేక

అదే అతడి ఆఖరి కేసు. రెండు సంవత్సరాల కఠిన కారాగార శిక్షగాని, వెయ్యి రూపాయిల జరీమానాగాని కట్టాలని శిక్ష విధించింది కోర్టు రుద్రయ్యకు. సాహుకారు పోగొట్టుకున్న వస్తువులు తిరిగి అందజేయబడినై.

ఇన్స్పెక్టర్ గజపతి అభిమానులు సభను ఏర్పాటుచేసి, అతని సేవలను ప్రశంసించేరు పూలదండలతో అలంకరించి సత్కరించేరు.

* * *

స్వగ్రామానికి చేరుకోవాలనే వుద్దేశంతో సామానులు సర్దుతున్నాడు గజపతి అతనికి సహాయపడుతూ పోలీసులంతా గడబిడగా వున్నారు. సూట్‌కేస్‌లు సర్దుకుంటున్న గజపతి చెవిలో ఎవరిదో స్త్రీ రోదనపడింది ఎవరో ఒకామె ఏడ్చుకుంటూ వీధి వెంబడి పడవడం గమనించేడు.

"ఒరే గిరి" పిలిచేడు.

"యస్సార్" అంటూ ముందు నిలబడ్డాడు గిరీశం.

"ఎవ్వరామె? ఎందు కేడుస్తుంది?"

"ఏమోసర్"

"యిలా పిలు"

"యస్సార్" అంటూ గిరీశం అటుగా వెళ్ళి ఆమెను పిలుచుకొచ్చేడు. అస్థిపంజరానికి చర్మం అంటించి నట్టుంది ఆమె ఆకారం. చిరిగిన చీర కట్టుకుంది. తైల సంస్కారం లేక జుట్టు పీచులా వుంది. కళ్ళు లోతుకుపోయి వున్నై. కాళ్ళు చేతులు వణుకుతున్నై మూడేళ్ళ అబ్బాయి ని ఎత్తుకొని వుంది. ఆ అబ్బాయి శరీరం మీద బట్టలు లేవు. ముక్కు కారుతుంది. తల రేగిపోయి వుంది. మురికితో శరీరమంతా నల్లగా వుంది. బక్కగా ఎముకల గూడులా వున్నాడు.

"ఏమైంది? ఎందుకలా ఏడుస్తున్నావు?" ప్రశ్నించేడు గజపతి.

"......" ఆమె రోదన ఎక్కువైంది. ఎదురుగా ఎస్సై వుండడం వలన ఆమె భయంతో వణికిపోతుంది.

"చెప్పవేం?" గద్దించేడు గజపతి

"నీ కాల్మొక్త, ఏంలేద దొర"

"మరెందు కేడుస్తున్నావ్?"

"ఆడికి జెలు సేసిండు దొరా"

()()()()()()()()()()()

# ద్వయానుసంధానం

— డాక్టర్ దాశరథి

కలం మీద
కాగితం మీద
కలిగ లేదు సుమకారం

నాల్క మీద
గుండె మీద
నా కెంతో విశ్వాసం

గుండె మండుతుంది
నాల్క పల్కుతుంది

అనుభూతికి గుండె
అభివ్యక్తికి నాల్క;
మనిషికీ మనిషికి
కావలసింది ఈ రెండే!

()()()()()()()()()()()

"ఎవరు నువ్వు?"

"రుద్రిగాడి ఆడదాన్ని."

"ఆహా..." తల పంకించేడు గజపతి, "తప్పుచేసి జైలు కెళ్ళేడు దానికి ఏడు పెందుకు? రెండేళ్ళలో తిరిగి రానే వస్తాడు కదా."

"నీ కాల్మొక్త దొరా! నే నెట్టా బతికేది? నా ఆరుగుర పిల్లల్ని ఎలా పోసించుకొనేది? ఒక్కరూ చేతి కందక పోయిరి .." దుఃఖంతో మాటలు పెగల లేదు. గజపతి నిశ్చేష్టు డయ్యాడు... తప్పెవరిది... శిక్ష వేరొకరిది.

"దొరా... నీ కాల్మొక్త. ఆడిని యిడిపించు దొరా... నాకు గుండె జబ్బు పయట ఆ మాయదారి జబ్బు ఐదేళ్ళ నుండి నన్ను పంపుక తింటంది గుండెల నొప్పి అప్పుడప్పుడు రగతం కారుతుంటది నోటిమండి... నే నెక్కువ రోజులు బతకను దొరా... నేను సస్తే నా పిల్లల గతేం కావాల? దిక్కులేనోలం... అంతా సిన్న సిన్న పీనుల మంద .. అడుక్కుతినే తెలివైనా లేదు దొరా... ఆకలికి అలంతా మల మల మాడి సత్తారు దొరా .."

గజపతి కళ్ళు తిరుగుతున్నై. అతని కళ్ళ ముందు న్యాయం జైలు జరీమానా ..



ఆకలి... దొంగతనం... క్షయ... చావు... రాక్షస వేషాలలో నిలబడిన్నై. ఆమె చెప్పకు పోతుంది.

"దేవుడి తోడు దొరా. మూడురోజులై మా కెవరికీ తిండి లేదు.. పిల్లలు ఆకలితో అలమటించి పోతున్నారు. నాకు కూలి చేసే శక్తి లేదు దొరా... ఆ దేవుడు నా బలం గుంజేసిండు కొంచెం పని సేస్తే నా కళ్ళు తిరుగుతై. గుండెలనొప్పి లేస్తది. నోటెంట రగతం పడతది."

కళ్ళు మూసుకున్నాడు గజపతి. "షో బైటకి" గర్జించేడు ఆమె గతుక్కుమంది. గిరీశం ఎటెన్షన్‌లో నిలబడ్డాడు. గజపతి ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు. ఆమె గుండెలో నొప్పి ఎక్కువైనట్లుంది. బాధతో పడుతుంది నోటి వెంబడి రక్తం వస్తున్నట్టుంది. తూలుకుంటూ వెళ్ళిపోయింది.

* * *

స్టేషన్ చిన్నది కావడంచేత, ఎక్కువ మంది పాసింజర్లు లేరు. గజపతి సామాన్లతో సహా స్టేషనుకు చేరేడు అతడిని రైలెక్కించడానికి గరీశం వచ్చేడు

చుట్టూ పరికించేడు గజపతి. ఒక మూలగ ముగ్గురు ప్రయాణీకులు కునికిపాట్లు పడుతున్నారు. మెట్ల క్రింద నీడలో

# దీపావళి బహుమతి కథ

బిచ్చగాళ్ళు అడుక్కు తెచ్చుకున్నది తింటున్నారు. మధ్యమధ్య కొట్లాడుకుంటున్నారు. కిళ్ళీబడ్డీ వీరయ్య బేరం లేక ఆకులు తోలుకుంటున్నాడు స్టాఫంతా వారి వారి పనుల్లో బిజీగా వున్నారు. బుకింగ్ విండో దగ్గర టిక్కట్ల కోసం పదిహేనుగురు నిలబడి వున్నారు. గూడ్సు బండొకటి పెద్ద శబ్దం చేసుకుంటూ వచ్చి నిలబడింది. ఒక బెంచి మీద కూర్చున్నాడు గజపతి.

"గిరి" పిలిచేడు.

"యస్సార్" ముందు నిలబడ్డాడు గిరీశం.

"కూర్చో" జాగా చూపేడు.

"వర్వాలేదు సార్" ఎదురుగా నిలబడ్డాడు విధేయతతో.

"నేను చాలా కఠినుడను కదూ."

"యస్సార్... కాదుసార్"

"నువ్వు కాదన్నా నాకు తెలుసు గిరీ... నేను కఠినుడనే నేను చేసే ప్రతీ చర్య వెనుకా ఎన్నో జీవితాలు బలి అయినై."

కళ్ళు మూసుకున్నాడు. అతని కళ్ళ వెంబడి నీళ్ళు. అతని మనసులో రుద్రయ్య భార్య, క్షయ, రక్తం... ఆకలి...

"గిరి" అరిచేడు గజపతి.

"యస్సార్."

"ఐదు నిముషాల్లో మన కష్టడీలో వున్న రుద్రయ్యను నా ముందు నిలపాలి."

"సార్..."

"గో ఔట్ నవ్."

"యస్సార్."

* * *

"ఏరా దొంగ గాడిదా... ఒంటికెట్ట వది లిందా?" పలకరించేడు గజపతి, తనముందు బేడీలతో నిలబడ్డ రుద్రయ్యను

"చిత్తం దొరా" తన వద్దకు తీసుకొచ్చిన కారణం తెలీక అయోమయంగా అన్నాడు రుద్రయ్య.

"మక్కిలిరగ్గొడితే చిత్తం గిత్తం వొదుల్తది" గతుక్కుపడ్డాడు రుద్రయ్య.

"దండం దొరా.. కొట్టకు"

"ఇక ముందు దొంగతనం చెయ్యనని నీ పిల్లల సాక్షిగా ప్రమాణం చేయరా."

"నా పిల్లలమీద పెమాణం దొరా... ఇక దొంగతనం సేస్తే నా పిల్లల్ని సంపుకు తిన్నట్టే."

"ఇక పో ... ఈ వెయ్యి రూపాయిలు తీసుకో... జరిమానా కట్టు."

ట్రైను వచ్చింది పాసింజర్లంతా నిలబడ్డారు. బేగ్ తెరిచి వెయ్యి రూపాయిలు తీసి రుద్రయ్య కివ్వబోయాడు గజపతి.

"సార్" గిరీశం అన్నాడు ఆశ్చర్యంగా.

"షటప్"

"యస్సార్"

రుద్రయ్య ఆశ్చర్యంగా "బాబా" అన్నాడు.

"తీస్కోరా గాడిదా?" గర్జించేడు టైగర్. వణుకుతూ అందుకున్నాడు రుద్రయ్య ట్రైను కదిలింది "నే వెళ్తున్నా. ఆ డబ్బు నా కష్టార్జితం. దానికి తగిన విలువ నివ్వడం ఇవ్వక పోవడం నీ చేతుల్లో వుంది నీవు దొంగతనాలు మానేస్తే నా కష్టార్జితానికి విలువ నిచ్చినట్లే" అంటూ రైలు ఎక్కేడు గజపతి. రైలు వేగాన్ని పుంజుకుంది చెయ్యి వూపుతూ ప్లాట్‌ఫారం మీద నిలబడ్డ గిరీశం, రుద్రయ్యల హృదయాల్ని ఒక పులి వన్నె మేక ఆక్రమించుకుంది.






సీరియల్

# ప్రేమపాశం

శ్రీమతి ప్రమీలాజనార్దన్

**జరిగినకథ 8** తోటి డాక్టర్ను, కొడుకు విజయ్ బలవంతము చేయగా భార్య జానకికి ఆపరేషన్ చేసి ఆమెను కాపాడిన డాక్టర్ మనోహర్‌కు డాక్టర్ శాంతి వల్ల మారిన తన వైవాహిక జీవితం గుర్తు కొస్తుంది. తన జీవితం తనవారి ఉన్నతికి పునాది కావాలని అనుకొన్న శాంతి, వాళ్ళ అవహేళనలకు గురౌతుంది. మనోహర్‌ను అపార్థం చేసుకొన్నానని బాధపడి, అతనికి క్షమాపణలు చెప్పుకోటానికి వాళ్ళ ఇంటికి వెళ్తుంది. అక్కడ మనోహర్ జానకిని హింసించటం చూచిన శాంతి అతనిని అసహ్యించుకుంటుంది. అపుడు అతడు జానకి వెనుకటి వృత్తాంతము ఆమెతో చెప్తుంటాడు. తన తల్లిదండ్రులను ఎదిరించి మేనమామ కూతురు జానకిని పెళ్ళిచేసుకొంటాడు మనోహర్. కట్నం రాలేదనీ, తన కొడుకుకి అత్తవారింట జరగవలసిన ముచ్చట్లు ఏవీ జరపలేదనీ మనోహర్ తల్లిదండ్రులు జానకిని హింసిస్తారు. భర్త మనసు అర్థం చేసుకున్న జానకి సహకారంతో శాంతి, మనోహర్‌ల వివాహం జరుగుతుంది. జానకితో కల్సి ఉండటానికి నిశ్చయించుకొని మనోహర్ ఇంటికి వచ్చేస్తుంది శాంతి. ఆ ఇంట్లో జానకి ఒక్కతే, ఆరోగ్యం సరిగ్గా లేకపోయినా అన్ని పనులూ చేయటం చూసి సహించలేక కామాక్షమ్మను పని మనిషిగా నిర్ణయించుతుంది శాంతి. అది చూసి ఒక్క శివయ్య తప్ప అందరూ అసూయ చెందుతారు.

బాబాయి మాటల గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నట్లున్నాడు విజయ్. పుస్తకం ముందు పెట్టుకొని యేటో చూస్తున్నాడు. శాంతి మెల్లగా వచ్చి, అతడి ప్రక్కన కూర్చుంది.

తృళ్ళిపడి చూసి, సోఫాలో నుండి లేవబోయాడు.

"విజయ్" చెయ్యి పట్టుకుంది.

"యేమిటా ప్రశ్న?" అతడి చేతిలో పుస్తకం తీసుకుంది.

పుస్తకంలో ప్రశ్నేమోగాని ఇప్పుడా చిన్న మెదడులో యెన్నో ప్రశ్నలు!

"విజయ్, ఈ రోజు నీకు అవసరమున్నది నేను చెప్తాను. రేపటి నుండి ఇక నీకీ ఇంట్లో యెవ్వరూ చెప్పనవసరం లేకుండా చేస్తాను."

అతడు కండ్లప్పగించి అలాగే చూస్తున్నాడు.

తనకు తెలియనివి మామూలుగా

(గత సంచిక తరువాయి)

తండ్రితో చెప్పించుకుంటూ వచ్చాడప్పుడు. కాని ఈ సమస్య అతడికి పూర్తిగా తీరటంలేదు.

"విజయ్, నీకిప్పుడు పుస్తకాలలో పాఠాలు తప్ప జీవితం అర్థం కాదు. అందుకే ... అందుకే...నీకేమీ చెప్పలేకపోతున్నాను. నీవు చదివి పెద్దవాడివయ్యాక యెవరూ చెప్పకుండానే అన్నీ అర్థమౌతాయి. అంతవరకు నన్ను అసహ్యించుకోకు."

శాంతి మాటలు ఆ పసి హృదయంమీద బాగానే పని చేశాయి.

వంటమనిషిని తెచ్చి అమ్మకు పని తగ్గించిందని, అమ్మతో కలిసి మెలిసి తిరుగుతూ కబుర్లు చెబుతున్నదని, ఇంతకు ముందే ఆమెను మదిలోనే ప్రశంసించిన అతడి కిప్పుడామె మాటలు తృప్తి కలిగించాయి. తల్లిని బాధిస్తున్నదనుకున్న అభిప్రాయమిప్పుడిప్పుడే పడలిపోతున్నది. ఇది

ఆ ఒక్క క్షణంలోనే జరిగింది మాత్రం కాదు. శాంతి వచ్చిన నాటి నుండీ ఆమె ప్రతిచర్యను పరీక్షగా చూస్తున్న అతడిలో ద్వేషాన్ని, ఈ క్షణం ఈ సంఘటన పూర్తిగా తుడిచి పెట్టేశాయి.

యాంత్రికంగా ఆమె ప్రక్కన కూర్చున్నాడు.

అతడి ముఖంలో ప్రశాంతత చూసిన శాంతి యేదో విజయం సాధించినంత పొంగిపోయింది. 'వాడి కండ్లలో కురిసేది నిశ్చయంగా తన పై అభిమానమే. అది ఒకరు చెప్తే కలిగింది కాదు. తనంత తాను సంపాదించింది. ఇది యెందరి స్త్రీలకు సాధ్యం!'

ఆమె నింతవరకూ అమితంగా బాధించింది విజయ్ ప్రవర్తన. చూసీ చూడ నట్లుంటాడు 'వాడి హృదయంలో వున్న ద్వేషం, కొట్టి తిట్టి చెప్తే పోయేది కాదు. తన ప్రవర్తనలో లోపం లేకపోతే తప్పకుండా వాడెప్పటికైనా తనను అభిమానిస్తాడు' అనుకుంది. ఆ విషయం ఇంట్లో యెవ్వరితో, చివరకు మనోహర్‌తో గూడా అనలేదు. అలా అంటే వాడి మీద మాటల ప్రయోగం జరగడం తథ్యం. దానితో వాడిలో ద్వేషం మరింత పెరుగుతుందను కుంది. ఈనాడు తా నాశించినట్లుగానే జరిగింది

"ఇప్పుడు పుస్తకంలో ప్రశ్నలకు జవాబులు తెలిస్తేనే రేపు జీవితంలో సమస్యలకు పరిష్కారాలను వెతుక్కొనే జ్ఞానం వస్తుంది. విజయ్, నీ చదువు అందరి చదువుల్లా కాదు. గొప్పగా వుండాలి. నీ చదువు జీవనాధారం చూపేదే కాదు. మానవత నిండేలా వుండాలి. కుళ్ళు, కపటం, ద్వేషం నీటి కతీతంగా వుంచాలి. అదే నిజమైన చదువు..." శాంతిమాటలు వింతగా వింటున్నాడు విజయ్

"తన మాటలు విన్నది. అందుకు సమాధానం కాబోలు ఈ ఉపన్యాసం." వరండాలో కూర్చున్న మూర్తి పళ్ళు కొరికాడు.

"పిలను, నీళ్ళ తల్లిని పుద్ధరించేందు కొచ్చిందేమో మహాతల్లి ఈ సంబరం యెన్నాళ్ళు! ఒదీ చూడబోమా!" తల్లిలాగే అనుకున్నారు లలిత, సుమిత్ర

ఇంట్లో జరిగే ప్రతి ఒక్క విషయం మనోహర్‌కు చెప్పాలనిపిస్తుంది శాంతికి.



కాని అతడికి ఇటువంటి విషయాలు తెలియకుండా పోలేదని అతడు జానకి గురించి చెప్పినప్పుడే తెలిసింది.

మధ్యతరగతి కుటుంబమైనా తననింత చదువు చదివించాడన్న కృతజ్ఞత అతడి అణువణువూ నిండి పోవడం వల్ల అతడేమీ అనలేక పోతున్నాడేమో.

తానిప్పుడు వాళ్ళ గురించి చెప్పి, అతడి దృష్టిలో చులకనవ్వడం తప్ప లాభంలేదు. 'అన్నయ్య సంతోషం చూడలేనివాళ్ళు! కష్టాలన్నీ తమ పాలు, సుఖాలు మనోహర్, జానకి పాలు అన్నట్టు మాట్లాడే మనుష్యులు! ఇవేవీ పట్టనట్టుండే మనోహర్! జానకి ఈ వాతావరణంలో యెలా వుంటున్నది!' అనుకుంటున్న ఆమెకు మనోహర్ నిర్లిప్త ప్రవర్తన కూడా నచ్చలేదు. 'యెంత తనకోసం ఆరాటపడ్డా, తన సరదాన్ని దోచుకొనే అవకాశం మరొకరికి ఇవ్వకూడదు...'

"యేమిటి, అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు?" పడుకుంటూ అడిగాడు మనోహర్.

"మీ గురించే." అని అతడి వైపు తిరిగింది.

"మనూ. మీకు చెప్పకుండా వంట మనిషిని పెట్టినందుకు కోపం వచ్చిందా?"

"యేమిటింత ఆకస్మికంగా, అనుకోకుండా పిలుచుకొచ్చావు?" నవ్వి ఆ విషయం అప్పుడే గుర్తొచ్చిందతనికి.

"ప్రొద్దున లేచినప్పటినుండి అందరికీ తొందరగా అన్నీ అమరిపోవాలి. ఔనా?"

"ఊఁ"

"చేసేది మాత్రం జానకి ఒక్కరే. ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నదని మీకుతెలుసు."

"ఔను. అనార్సైనప్పటినుండి మనిషి బాగా చిక్కిపోతున్నది."

"దానికి కారణం అనారోగ్యం ఒక్కటే కాదు. మనసు కూడా బాగా దెబ్బతిన్నది. ఆమె తనలో తను మానసికంగా కుళ్ళిపోతూ శారీరకంగా అలిసిపోతూ పని చేస్తుంటే యెలా భరించడం?"

"చాలా మంచి పనిచేశావు శాంతీ." మెప్పుకోలుగా అన్నాడు.

"నాకిన్నాళ్ళు ఈ ఆలోచనే రాలేదు..."

"నేనూ ముందుగా అనుకోలేదు. ఏడు గంటలకు హాస్పిటల్ నుండి ఇంటికి వస్తుంటే మా ఫ్రెండ్ కనిపించి బలవంతంగా వాళింటికి తీసుకెళ్ళింది. మాటల సందర్భంలో వాళ్ళ వూరుమండీ దూరపు బంధువొకామె భర్త పోయాక దిక్కుమొక్కు లేనిదై, ఉన్న కాస్త పొలం అమ్ముకొని తిని జీవనోపాధి చూపించమని ఇక్కడికి వచ్చి వారం రోజులయిందని చెప్పింది అక్షరజ్ఞానం-లేని ఆమె వంటపని తప్ప యేంపని చెయ్యగలదు? తెలిసిన వాళ్ళెవరికైనా చెప్పమన్న వెంటనే మనమే యెందుకు పెట్టుకోకూడదు? అనుకున్నాను. ఆ మాట దానితో చెప్పాను. సంతోషపడ్డది. ఆమె భర్తకొచ్చే జీతం అక్కడికక్కడికే సరిపోతున్నప్పుడు మరో మనిషిని భరించడం కష్టమేగా మరి.

వంట గదిలోనుండి మా మాటలు విన్న కామాక్షమ్మ అప్పుడే నా వెంట వస్తానన్నది. అనుకోకుండా జరిగింది కాబట్టి ముందుగా మీకు తెలియలేదు"

"నాకు ముందుగా చెప్పలేదని నేననుకోడం లేదు. అనుకోకుండా ఆకస్మికంగా జరిగిందికాబట్టి ఆశ్చర్యపోయాను, అంతే"

"రేపు విజయ్‌కు ట్యూషన్ మాట్లాడాలనుకుంటున్నాను."

"యేం, ముందుగా చెప్పలేదనుకుంటావని చెప్తున్నావా?" అతడి నవ్వుతో పాటు ఆమే శృతి కలిపింది.





కొద్దిసేపటి తర్వాత మనోహర్ అన్నాడు. "శాంతీ, వంట మనిషి అవసరమే. కాని విజయ్‌కు తెలియనివి చెప్పేందుకు ఇంట్లో ఇందరున్నారు..."

మనోహర్ అమాయకత్వానికి జాలి కలిగింది. మూర్తి అన్న మాటలు అతడికి వెంటనే చెప్పెయ్యాలనిపించింది కూడా. కాని దానివల్ల అతడు బాధ పడటమే గాని ప్రయోజనం లేదనుకొని మిన్నకున్నది.

"ఇంట్లో వాళ్ళెప్పుడో యేదో చెప్పేకన్నా రోజూ టీచర్ శ్రద్ధగా చెప్తే బాగుంటుంది. ఇప్పుడు మనం శ్రద్ధ తీసుకుంటేనే రేపు వాడికి వుజ్వల భవిష్యత్తు వుండేది"

"నీ ఇష్టం."

విజయ్‌కు ట్యూషన్ చెప్పించడం పెద్ద విషయం కాకపోయినా, శాంతి ఆ పని చెయ్యాలనడం వల్ల అదో ప్రత్యేక విషయంగా అనిపించింది తులశమ్మకు. దాన్ని గురించి కొడుకులకూ, కూతుళ్ళకు కొంప మునిగినట్లు చెబుతుంటుంది.

"శాంతీ, అనవసరంగా కోరి కష్టాలు తెచ్చుకుంటున్నావు. ఇప్పటికైనా మించి పోయింది లేదు. మరో ఇల్లు చూసుకొని హాయిగా వుండు" అందో రోజు జానకి.

"అలాగే, ఇల్లు చూస్తాను మీరూ వస్తారా?" అంది వెంటనే

## ప్రేమ పాశం

"శాంతీ, నేను యెలా వస్తాను?"

"నన్ను వెళ్ళమని మీరు రాననడంలో అర్థం?"

"నీకీ బాధెందుకని."

"అంతేనా? మీకున్న బాధ్యత నాకు లేదనా? లేకా అర్హత లేదనా?"

"శాంతీ."

"జానకీ, ఇక ముందెప్పుడూ ఇలా అనకండి. ఈ మాటలకు నేను భయపడను. బాధ పడను కాని, నా స్వార్థం మానుకొని నన్ను మీరు వెళ్ళమంటేనే నాకు బాధగా

వుంటుంది. ఈ ఇంటి మనిద్దరి స్థానం ఒక్కటే. అలాగే బాధ్యతలు మి ఒక్కరివే కాదు. నావి కూడా.'' శాంతికా ఇంటి నుండి పారిపోవాలని యేకోశానా లేదు. అత్తగారి ప్రవర్తనలో, ఆడబిడ్డల మరుదుల ముఖాలలో బాగా అర్థం చేసుకొని అవి తొలగిపోయే రోజు తొందరగా రావాలనుకుంటుంది రేపటి గురించి యెన్నో ఆలోచన్లు! యెంతో ఆశ.

శాంతిలో అన్ని ఆలోచన్లున్నాయని మనోహర్‌కు కూడా తెలియదు.

నిజానికి పుట్టింట్లోకన్నా, అక్కడ సమస్య తక్కువ. మనుష్యుల ప్రవర్తన కూడా విపరీతంగా వుంది; కానీ అక్కడ తనకు విలువలేదు. సంపాదించి పెట్టడం వరకే తన బాధ్యత అన్నట్లు ప్రవర్తించారు. ఇక్కడ తనకో ప్రత్యేక స్థానమున్నది. తన మాటకు విలువ వుంది. ముఖ్యంగా ముందు జీవితం గురించి దిగుల్లేదు.

శాంతి మనోహర్ ఒకేచోట ప్రాక్టీసు చేస్తున్నప్పటి నుండి పేషెంట్ల సంఖ్య బాగా పెరిగింది. అందులో మనోహర్ అద్దె తక్కువ. మిగతా చోట్లలో లాగా, ఆ ప్రాంతంలో డాక్టర్ల సంఖ్య అధికంగా లేని కారణంగా కొంత లాభం వుంటుందని సిటీకి కాస్త దూరంగావున్న ఆ ప్రాంతంలో డిస్పెన్సరీ పెట్టుకున్నాడు ఆ ప్రాంతం కూడా ఇప్పుడు సిటీలో బాగా కలిసిపోయి జనం రద్దీగా తిరుగుతున్నారు. యెన్నో ఆఫీసులు, స్కూళ్ళు, కాలేజి కూడా వెలిసింది. వాటితోపాటు డాక్టర్లూ పెరిగారు. కాని చాలా రోజులుగా అక్కడున్నందువల్లనే కాకుండా, మంచితనంతో ఇదివరకే అక్కడి ప్రజల మనస్సుల నాకట్టుకున్న కారణంగా, మనోహర్ డిస్పెన్సరీలోనే యెక్కువ రోగులు కనిపిస్తారు.

గవర్నమెంట్ డాక్టర్లనగానే అవసరమైతే హాస్పిటల్లో చేర్పించి పరీక్షలు చేస్తారని వచ్చేవాళ్ళు కూడా కొందరుంటారు.

---

# ప్రేమపాశం

శాంతి వచ్చిన తర్వాత స్త్రీల కేసులన్నీ ఆమే చూస్తున్నది.

"శాంతీ, నువ్వొచ్చిన తర్వాత ఆడవాళ్ళ సంఖ్య యెక్కువైపోయింది. నీతోపాటు ఇక్కడికి జబ్బులు కూడా పట్టుకొచ్చావా?" నవ్వుతూ అన్నాడు మనోహర్.

"డాక్టరుగారు పొరబడుతున్నారు. ఇదివరకీ జబ్బు లిక్కడ యెవ్వరికీ లేవనికాదు. కొందరు ఇతర డాక్టర్ల దగ్గరికి వెళుతుంటారు. మరికొందరు దూరం వెళ్ళే ఓపిక లేక యే చిట్కా వైద్యాలో చేసుకుంటుంటారు. అందుభాగాలలో, లేడీడాక్టర్, అందులో పేరు సంపాదించుకున్న డాక్టరుగారి సతీమణి రావడంతో నమ్మకంగా వస్తున్నారు."

"ఐ సీ ?" నవ్వాడు మనోహర్.

పేషెంట్‌ను పరీక్ష చేసేందుకు లోపలి గదిలోకి వెళ్ళి, అయిదు నిముషాల తర్వాత వెలుపలికి వచ్చిన శాంతికి తన కుర్చీ యెదురు కుర్చీలో కూర్చున్న కిరణ్ కనిపించగనే తనకు తెలియకుండానే సంతోషం పొంగి పొర్లింది.

"యేమిటిలా వచ్చావు?" అతడి యెదురుగా కూర్చుంటూ అడిగింది.

"నువ్వింటినుండివచ్చి యెన్నాళ్ళయిందో తెలుసా ?"

"ఇక రెండు మూడు రోజులలో నెలవుతుంది. యేమిటోరా, పని ఒత్తిడి వల్ల రాలేక పోతున్నాను."

"యెలా వీలవుతుంది? వచ్చిన డబ్బు వాళ్ళ చేతుల్లో పోసి వాళ్ళకు చాకిరి చేయొద్దూ!" కిరణ్ స్వరం తీవ్రంగా పలికింది.

"కిరణ్..." మబ్బులు తొలగిన ఆకాశమంత నిర్మలమైన హృదయంతో తను మాట్లాడినా వాడు మాట్లాడడం లేదు. తనలో మళ్ళీ గతం పొరలను బలవంతంగా బైటికి లాగడు.

"నీ విచ్చిన డబ్బు అయిపోయింది. డబ్బు కావాలి."

'అయితే కిరణ్ డబ్బుకోసం వచ్చాడన్నమాట!' తనకోసం రాలేదనుకుంటే బాధ, కసి, కోపం బయలుదేరుతున్నాయి.

"ఆరొందలు' అప్పుడే అయిపోయాయా ?"

"లెక్క చెప్పాలా ?"

"కాను. చెప్పాలి. కాని ఇక్కడ ఇప్పుడు కాదు. నేనే రేపు వస్తాను." అంటూ వ్యానిటీ బ్యాగ్‌లో నుండి డబ్బుతీసి లెక్కపెట్టి వందరూపాయలు ఇచ్చింది.

"యెల్లుండి అమ్మ, మాధవి మద్రాసు వెళ్తారు." ఆ డబ్బు చాలదన్నట్లు చూశాడు.

"నేను రేపు వస్తాను." అతడికి మళ్ళీ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా లేచి నిల్చుంది.

కిరణ్ వెళుతూండగా, శాంతితో యేదో కేసు విషయం మాట్లాడేందుకు అవతలి గదినుండి వచ్చిన మనోహర్‌ను చూసినా పలకరించకుండా పోవడం చూసిన శాంతి మనసు చివుక్కుమన్నది.

"యేమిటి, కిరణ్ అలా కోపంగా వెళ్ళిపోతున్నాడు ?"

"నేను ఇంటికి రాలేదని" అంతకన్నా యేం చెప్పగలదు ?

అతడంటే తన తమ్ముడికి కోపమని చెప్పగలదా ? తన తల్లి స్వార్థంగా ఆస్తి, వాళ్ళు తన భర్త దృష్టిలో లేలిక్కైపోతారన్న ఆడ మనసులో, అతడు బాధ పడడం తప్ప, ఒరిగేదేముందన్న ఆలోచనతో చెప్పలేదు. ఇప్పుడూ అంతే.

"నిజమే శాంతీ. ఊళ్ళోనే వుండి ఇన్ని రోజులు వెళ్ళకపోవడం బాగలేదు. రేపు తప్పకుండా వెళ్ళిరా. నిన్ను పంపించలేదని కోపంతోనేమో కిరణ్ నాతో మాట్లాడకుండా వెళ్ళిపోయాడు' అన్నాడు మనోహర్.

ఆ తర్వాత పేషెంట్లను చూడడంలో నిమగ్నమైపోయి ఆ విషయం తాత్కాలికంగా మరచిపోయిన శాంతిని రాత్రి పడుకోగనే మళ్ళీ కదిలించింది.

తను ఇక్కడికి వచ్చేటప్పుడు ఆరువందలు ఇచ్చివచ్చింది. అప్పుడొకసారి ఇంటికి కావల్సిన సరుకులు తెస్తున్నది.

కిరణ్, మాధవి చదువైపోయింది. రాధికను కాలేజీలో చేర్పించనే లేదు. డబ్బు అయిపోయిందంటే, అడిగినంత ఇచ్చేందుకు తనున్నానని, విచ్చలవిడిగా ఖర్చుపెట్టి వుంటారు.

ఆ మర్నాడు సాయంత్రం వెళ్ళి, తల్లితో అంది.

"నీ మీద . ఆధార పడ్డామనేగా ఈ

(44వ పేజీ చూడండి)



# కార్టూనిస్టుల తోరణం






పండుగ స్వీట్సు ఈ రకంగా
చేశానంటే విని పించుకోరేం?!


మీ ఆయన దీపావళి అమావాస్య
నాడు పుట్టాడే కోడలా!! అప్పుడే
అనుకున్నా....


నువ్వేం భయపడకే ప్రసూనా! ప్రతిసారీ
బయట టపాసులు పేలినప్పుడు ఆయనిలా
అవుతుంటారు!!


మీరెప్పుడూ ప్రకటన బాంబ్
పట్టుట్లో ఫెయిలయ్యారు....
మేం ఎన్నో జాగ్రత్తలు
తీసుకొన్నప్పటికీ మా
ఆవిడ నెల తప్పి
నప్పుడు...
టీవీయస్ మూర్తి


ఛ్ఛ.. చీదేసింది...


మతాబా కాల్చుతా! కాదు
తారాజువ్వ కాల్చుతా! కాదు
కాదు చిచ్చుబుడ్డి కాల్చుతా!!
పార్టీలు మారినట్లుగా
ఇక్కడ కూడా ఏంటండీ?
ఏదో ఒకటి
కాల్చుకోక!!


వెవ్వెవెవ...

దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన కథ

# నిజం





**లేవగానే టేబుల్ మీదున్న డైరీ తీశాడు భాస్కరం. కొత్త సంవత్సరం డైరీ అది. అందులో మొదటి పేజీలో రాత్రి రాసుకున్న "కొత్త సంవత్సరం నిర్ణయాలు" న్నాయి.**

**"మొదటిది — అబద్ధం ఆడరాదు. ఎట్టి పరిస్థితుల్లోనూ నిజమే చెప్పాలి. హరిశ్చంద్రుడి కన్న ఎక్కువగా కష్టాలు పడతారా ఎవరయినా? అబద్ధమాడడమంటే మనల్ని మనం మోసం చేసుకోవడంలాంటిది. దొంగలకి మనకి తేడా ఏమిటి?**

రెండవది — చెడ్డ అలవాట్లు మానాలి. 'చెడు' అంటే సిగిరెట్లు, మందు అన్నమాట.

మూడవది — ప్రతి మనిషి తన మనసులోని 'చిన్నతనం' అట్టే పెట్టుకోవాలి. చిన్నతనం అంటే చేయంచి పనిచేసి సిగ్గుపడడంకాదు. పసిపాప కంట్లో మనం వేలు పెట్టేందుకు ప్రయత్నించినా వాళ్ళు కళ్ళు మూసుకోరు. అంత అమాయకత్వం వాళ్ళది. పలకని శుభ్రంగా తుడిస్తే ఎంత చక్కగా ఉంటుంది? దానిమీద ఏమయినా రాయచ్చు. అందరూ అలా ఉన్ననాడు ప్రపంచం ఎంత సుందరంగా ఉంటుంది?"

ఇంకా పూర్తికాకుండానే "కాఫీ అయింది. ముఖం కడుక్కున్నారా లేదా?" అంటూ వచ్చింది శ్యామల.

డైరీలోంచి తలెత్తి ఆమెవంక చూశాడు భాస్కరం. "కొత్త సంవత్సరం కొత్త నిర్ణయాలతో ప్రారంభిస్తున్నాము.. అందరం తు. చ. తప్పకుండా ఆచరించాలి" అన్నాడు.

"కాఫీ తాగాక. ముందు ముఖం కడగండి బాబు."

"కడగరాదూ నువ్వే?"

"ఎంతిస్తారేమిటి?... ఇదేమయినా పెళ్ళనుకున్నారా ఏమిటి? మీకు అయి చాలాకాలం అయింది స్వామి."

"ఎదురుగా నువ్వు కనబడుతూ అవలేదని అనుకుంటే వూరుకుంటావా?... ఈ రోజు నుంచి అబద్ధాలాడదలుచుకోలేదు."

"అయితే ఇన్నాళ్ళూ మీరు అబద్ధాల పుట్టన్నమాట" నవ్వింది శ్యామల.

"అలా కాదోయ్. ముఖ్యమయిన విషయాలు శ్రద్ధగా వినాలి మరి."

"చెప్పండి గురువుగారు" అంటూ కూర్చుంది శ్యామల.

"చెప్పానుగా. మొదటిది మనసు నిర్మలంగా ఉంచుకోవాలి. పసిపిల్లల కళ్ళు చూశావా ఎప్పుడయినా?"

"ఇద్దరు పిల్లల్ని పెంచుతున్న తల్లిని తెలుసా?" అంది సగర్వంగా.

"తెలియదు. ఎవరి పిల్లలేం?"

"ఛప్ వెధవమాటలు!... సరే పసిపిల్లల కళ్ళు చూశాను."

"అంత అమాయకంగా ఉండాలి మనసు. రెండవది అబద్ధం ఆడరాదు. ఇదివరకు మాట వేరు. ఇకముందు ఎట్టి పరిస్థితుల్లోనూ నిజమే మాట్లాడాలన్నమాట."

"అయితే తమరు హరిశ్చంద్రుడన్నమాట! నేను చంద్రమతి రోల్ వేయలేనండి బాబు. మరెవర్నయినా చూసుకోండి."

"ఈ క్షణంలో చూసుకుంటాను. ఇప్పుడన్నమాట కాగితంమీద రాసివ్వు."

"మంచి హుషారుగావుండే అబ్బాయిగారి పవి. తల నెరిసిపోతోంది మాస్టార్ూ, మీ పక్కన చంద్రమతి ఇంకెవరండీ వేసేది? నేనిచ్చిన చెల్లు కాగితం చూసుకుంటూ బాధపడాలిసిందే."

"ప్చ్. సాయింత్రానికి పదిమంది ఆడపిల్లల తండ్రులు ఇంటిముందు నిలబడతారు. ఆ అమ్మాయిల్లో ఎవరు బావున్నారో సెలెక్షన్ నువ్వే చేద్దువుగానిలే – మాజీ భార్య హోదాలో."

"కాళ్ళిరక్కొడతాను."

"చంద్రమతి రోల్ వేయబోతూ అంతేసి మాటలు అనకూడదు మొగుడ్ని"

"అయ్యయ్యో, మీ కాళ్ళు కావండి స్వామి! మీకు పిల్లనిస్తానన్న వాళ్ళవి."

"ఆల్‌రైట్ ఆల్‌రైట్. పాయింటు కొద్దాం. అహంకారం, కోపం తగ్గించుకోవాలి."

"గురూగార్తూ!" బయటనుంచి కేక వినబడడంతో లేచి నిలబడింది శ్యామల. "ప్రథమ శిష్యుడు, జీవితాంతం మీవద్ద అప్పు పుచ్చుకునేవాడూ అయిన మీ రమణరావుగారి ఆర్తనాదం వినబడిందికదూ! తెల్లవార్తూ కొత్త సంవత్సరాన్ని పిలవడంతోనే జీతం అంతా ఖర్చయిపోయుంటుంది. ఇప్పుడు 'కొత్త సంవత్సరంలో పరదా'కి మీ సహాయంకోసం వచ్చివుంటాడు. సిగ్గుండాలి."

"అతనికా నాకా?"

"ఇద్దరికీనూ. పెళ్ళాం బిడ్డలు అలో లక్ష్మణా అని పీడిప్రాణాన పడి ఏడుస్తుంటే వీడికి తాగేందుకు, గుర్రాల్ని కమాన్, కమాన్' అని పిల్చేందుకూ ఎక్కడలేని డబ్బూ చాలడంలేదు అందుకు మీ సహాయం" అంటూనే విస్సురుగా లోపలికి వెళ్ళిపోయింది శ్యామల.

రమణరావు వచ్చి కూర్చున్నాడు. ముఖమంతా గాలితో పంపుకొట్టినట్లుగా వుంది "రాత్రంతా నిద్రలేదు గురువుగారు" అన్నాడు.

భాస్కరం ఏమీ మాట్లాడలేదు.

"రాత్రి వస్తారనుకున్నాం ... టెన్ – ట్వెంటీ వేశాం సంవత్సరానికి ఆఖరుకదా అని."

"సంవత్సరానికేగాని నీ జీవితానికి కాదుగా!"

నవ్వాడు రమణరావు. "ఇంకా ఎన్ని సంవత్సరాల నిలా ఆహ్వానించాలో. అప్పుడే నన్ను పంపించేయకండి మరి. మీరొస్తారని తెగచూశా – రాలేదేం?"

"రాలేదు" అన్నాడు భాస్కరం ముక్తసరిగా.

"అర్థమయిందిలెండి గురూగార్తూ, ఇంట్లో 'ఎమర్జెన్సీ డిక్లేర్' అయుంటుంది. అందుకే నా పద్ధతి మంచిది. ఇంటికి వెళ్ళి ముఖం చూపిస్తే ఈ ఇబ్బందులొస్తాయి. నేరుగా వెళ్ళి ముగ్గులో కూర్చుంటే రుద్రుడికూ్కడా తెలియదు ఎక్కడుండీను."

"రాత్రి మీ ఇంట్లో పిల్లలు, మీ ఆవిడా తిండి తిన్నారంటావా?" అడిగాడు భాస్కరం.

గబుక్కున తలెత్తి అతనివంక చూశాడు రమణరావు. "గురువుగారేమిటి చిత్రంగా మాట్లాడుతున్నారీరోజు. ఇంట్లో మరీ గొప్ప ప్రమాదమే జరిగినట్లుందే నిన్న! పదండి సార్ అలా వెళ్ళి 'ఎ స్మాల్ క్వాంటిటీ' తగిలిస్తే ఈ ధోరణి పోయి నూతనోత్తేజం, నవయౌవనం" అని నవ్వి "మిమ్మల్ని వదిలేస్తే కుంకుమ బొట్టెట్టుకుని గుళ్ళు గోపురాల్లోకి వెళ్ళిపోయేట్టున్నారు ఖర్మ! అక్కయ్యగారు మంచి కంట్రోలే పెట్టారు ముఖం కడిగారాలేదా? లేవండి మరి."

"నేను రాను."

"రానంటే ఎలా, భలేవారే. రాత్రి కూడా అంతా బోసిపోయింది."

"డబ్బుల్లేక ఇబ్బంది పడుంటారు పాపం."

"నిజం గురూగారు, రాక్‌ఫెల్లర్‌లాగా మీరలా కూర్చుంటే కదా మావంటి పీదా బిక్కీ బతికేది! రాజా ఆదుకున్నాడను కోండి. ఏమయినా ... లేవండి."

"నేను రానని చెప్పానుగద!"

తెల్లబోయాడు. "నిజంగా మాట్లాడుతున్నారా? కొత్త సంవత్సరం జోకా?"

కోపం వచ్చింది భాస్కరానికి. "నిజం నూరుపాళ్ళదే ఎప్పుడూను. నేను రాను."

కాసేపు మాట్లాడలేదు రమణరావు. "పోనీ ఒక వందిటు పారేయండి. మీ పేరు చెప్పుకుని కొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతాను"

"పైస ఇవ్వను."

"సర్లెండి. మనకిది మామూలేగా. అవతల టైమయిపోతోంది."

"చూడు రమణరావు, ఒక్కటే మాట నాది ఇవ్వను."

"అంటే ఏమిటి మీరనేది?"

"ఇవ్వను. తాగి తందనాలాడేవాడి కివ్వాలే కాదు, ఇహ ఎన్నడూ ఇవ్వను."

లేచి నిలబడ్డాడు రమణరావు. "పోనీ ఒకపని చేయండి. మా ఇంట్లో బియ్యం వున్నట్లులేవు. దానికివ్వండి" అన్నాడు.

"పద – ఒక బస్తా వేయిస్తాను ... అలానూకాదు. ప్రతిరోజూ మా ఇంటికి రా ఆరోజుకి వేయిస్తాను. లేకపోతే బియ్యం అమ్ముకుని తాగినా తాగ్గలవు."

అతని ముఖం ఎర్రబడిపోయింది. "మీరిందాకనుంచి సరదాగా మాట్లాడుతున్నారని ఊరుకున్నాను" అన్నాడు.

"సరదాగా కాదు. నిజంగానే 'నిజం' మాట్లాడుతున్నాను. తిండిలేక మాడుతున్న పిల్లల్ని తలుచుకో. కొత్త జీవితం ప్రారంభించు ఈరోజు నుంచి. దానికెంత సాయం కావాలన్నా చేస్తాను. వీటికి మాత్రం పైస ఇవ్వను."

"ఏమిటండి మీరిచ్చే బోడి పైస? వూరికినే ఇస్తున్నారేమిటి నాకు? మీకు బజార్లో పనులు చేసుకోవడం చేతకాక నాకు ముడుపుగా చెల్లిస్తున్నారు. సినిమాలకి మొదటిరోజు టికట్లు, రైల్లో రిజర్వేషన్లు, బస్సుల్లో సీట్లు — యివన్నీ చేస్తాను కనుక మీరిచ్చారు. ఊరికే యిచ్చినట్లు ఎగురుతారేమిటి? నాకు బజారులో వున్న పరపతిని మీకున్న డబ్బుపెట్టి కొనుక్కున్నారు. బార్టర్ సిస్టమ్! అవునా కాదా?"

భాస్కరరావు మాట్లాడలేదు

"మాట్లాడతారు. నోరు పారేసుకుంటే ఊరుకుంటానేమిటి?... తాగి తందనాలాడే వాడినా! ఇన్నాళ్ళు వాడినే ఇంటిచుట్టు తిప్పుకున్నారు. మీకు రమణరావులు దొరకడం కష్టం మాస్టారూ! నాకు భాస్కరరావులు— రాత్రే ఏర్పాటయ్యారు! వస్తామరి. అవసరమయితే సిగ్గుపడకండి — ఇదివరకటి అగ్రిమెంటు మీదే మళ్ళీ మన స్నేహం కంటిన్యూ చేద్దాం" వెళ్ళిపోయాడు రమణరావు.

భాస్కరం అచేతనుడయి నిలబడి పోయాడు. కాసేపటికి తెప్పరిల్లి వెనక్కి తిరిగితే గది గుమ్మంలో నిలబడి ఉంది శ్యామల.

నవ్వి "హరిశ్చంద్రుడుగారు కూడా ఇటువంటి ఇబ్బందులే పడ్డారనుకోండి. ధర్మరాజు కొంచెం నాడెం అనుకుంటూ... ఇతని స్నేహం పోవడం మంచిదే. బాధపడకండి అందరూ ఇలానే చెప్తే అతను బాగుపడచ్చుకూడా" అంది శ్యామల.

"బాధపడడంలేదు శ్యామలా, స్నేహాన్ని ఇంత పుటుక్కున తెంపగలవాడితో ఇన్నాళ్ళు ఎలా తిరిగానా అని ఆశ్చర్యపడుతున్నాను" అన్నాడు భాస్కరం.

అయితే లోలోపల అతనికీ తెలుసు రమణరావు చెప్పింది వాస్తవానికి దగ్గరలో ఉందని. అవతలివాడు నిజాన్ని అంతగా గ్రహించగలగడమే అతనికి బాధ కలిగించింది. రమణరావుకి అలా గ్రహించగ గే తెలివి

# నిజం

ఉందని అతను ఎన్నడూ అనుకోలేదు.

"ముఖం కడుక్కోండి మహానుభావా, ఒక దులుపుడయిపోయిందిగా" అంటూనే బ్రష్ వగయిరాలు అందించింది శ్యామల...

కాఫీ చేతికిచ్చి "మీకోసం ఇంటాయన కూర్చున్నారు ముందుగదిలో" అంది శ్యామల.

"ఆయనకి కాఫీ ఇచ్చావా?" అడిగాడు భాస్కరం.

"మిమ్మల్ని అడిగి ఇస్తానని చెప్పాను ఆయనతో. పాపం ఎదురు చూస్తున్నాడు మీ కోసం" అని నవ్వి "తాగడం, వక్కపొడి వేసుకోవడంకూడా అయింది" అంది.

"అంతా తిక్కమనిషి, తిక్కమాటలూ! నేరుగా మాట్లాడవు" అంటూనే ముందు గదిలోకి వెళ్ళాడు.

"రావోయ్ భాస్కరం, నీతో మాట్లాడదామని రెండు రోజులుగా చూస్తున్నాను" అన్నాడు ఇంటాయన.

"అదేమిటండీ, నేనేమయినా కలెక్టర్నా, గవర్నర్నా — అంతగా రెండు రోజులు చూడటానికి?"

నవ్వాడాయన. "అదికాదులే, ఈ రోజు మంచిది. మంచి విషయాలు మాట్లాడేందుకు మంచి చెడ్డ చూసుకోవాలి కద!"

విషయం అర్థం కాకపోవడంవల్ల వినయంగా కూర్చున్నాడు భాస్కరం.

"మా అమ్మాయి లేదూ పార్వతి, దానికి పెళ్ళి సంబంధాలు చూడాలి కద!"

"అవునండి చూడక్కరలేదూ మరి!"

"మీ మేనల్లుడొకడి ఊళ్ళో చదువుకున్నాడే అతనిప్పుడు బ్యాంకులో ఆఫీసరటగా?"

భాస్కరం ఇబ్బందిగా ముఖంపెట్టి 'అవునండి' అన్నాడు.

వింటున్న శ్యామల "బాబాయిగారికి నేనే చెప్పాలెండి." మా మోహన బ్యాంకులో చేరాడండి ఆఫీసరుగా 'అని' అంది.

"అతన్ని చూశానుకదయ్యా, కుర్రాడు బావుంటాడు. వినయం వందనం కలవాడు కద. కదిలించి చూడు మీ అక్కయ్యని బావగారిని. 'ఆశ' ఎంతవరకూ ఉంటుందేం?"

'ఆశ' అన్న మాట నచ్చలేదు భాస్కరంకి. ఒక నిముషం తటపటాయించి "ఆశ అనకండి. మావాళ్ళకి అటువంటి ఆలోచన లేదు" అన్నాడు.

"అహ, నా ఉద్దేశం అదికాదు. కట్నం అన్నమాట. కుర్రాడిని చదివించుకున్నది కట్నం పుచ్చుకునేందుకేననుకో."

"అదీ తప్పే! వాడు మంచి ఉద్యోగం చేస్తాడని. కట్నంకోసంకాదు."

"సర్లెండి బాబాయిగారు, విషయం మాట్లాడండి. వీరివన్నీ నియమాలు కద!"

"నా ఉద్దేశం కట్నమన్నది సంతోషంగా ఇచ్చేది. బేరం ఆడేది కాదు."

"అలాగేలేవయ్యా, నీకింకా లోకం తెలియదులే నేనెన్ని పెళ్ళిళ్ళు చేశానంటావు. ఈ మాటలు, బేరాలు ఎరగనివంటావా?"

"మా కుటుంబంతో సంబంధం చేయలేదు మీరు. అందువలన మావాళ్ళ విషయం తెలియదు మీకు. మీరు చూసిన వాళ్ళందరూ లౌకికమయిన ఆలోచన కలవాళ్ళు కావచ్చును."

ఆయన ముఖం కొంచెంగా చిట్లించాడు. "అక్కడికి మనం ఒక్కరమే పారమార్థికం ఆలోచిస్తాం!... సర్లే. ఇంతకీ మీ మేనల్లుడికి మన పార్వతిని మాట్లాడాలి. వాళ్ళు అడిగిన కట్నం పడేద్దాం. అందులో ఇబ్బందేమీ వుండదు. నీకు తెలుసుకద..."

"మళ్ళీ మీరు అలానే మాట్లాడుతున్నారు. 'పడేద్దాం' అనకూడదు. తప్పు మాట అది."

"సర్లెండి బాబాయిగారూ, 'ఇద్దాం' అనండి" అంది శ్యామల.

"చూడమ్మా, నేనిప్పటికి ఎన్ని చూశాను? అనుభవం మీదనే చెబుతున్నాను. కట్నం వాళ్ళు అడిగింది పారేయడమే, మనక్కావలసిన కుర్రాడిని తెచ్చుకోవడమే — అవే పెళ్ళిళ్ళు ఈ రోజుల్లో!"

"మావాళ్ళు అటువంటివాళ్ళు కారని చెప్పాను మీకు. పైగా ఇది-జరిగేపని కాదు."

"ఎందువల్లనో. కట్నం దగ్గర మన చేతి కడ్డంలేదని చెప్పాగా!"

చిరాకొచ్చింది భాస్కరానికి. "ఎంతసేపూ మీరు మీ కోణం నుంచే మాట్లాడుతున్నారు. తెలుగులో 'చేతి కడ్డంలేదు' అన్న మాట దానానికి వాడతారు. కట్నం దానం కాదని గ్రహించండి. అంతకన్నా ముఖ్యం మావాళ్ళు మీకన్నా నాకు బాగా తెలుసునని ఒప్పుకుంటారనుకుంటాను. మావాడు మీ అమ్మాయిని చేసుకోడు."



తొక్క వొలిచిన ఉల్లాసం




నారింజ రుచిగల

**బ్రిటానియా డిలైట్** కరకరల కమ్మదనం నింపుకొన్న బిస్కట్



"ఎందుకో ?"

"ఎందుకేమిటి ? అదంతే!"

"అవునయ్యా ప్రతిదానికి కారణం వుంటుందికద! అదేమిటి అనే నేనడిగేది."

"మీ అమ్మాయి పొట్టి."

తెల్లపోయాడాయన.

"అందువల్ల మావాడికి నచ్చదు."

"అదేమిటి పొట్టి అయినంతమాత్రాన... కావాలంటే మరో రెండువేలు వేసుకోమను."

"చూడండి మాస్టారూ, డబ్బు, మనసు— ఈ రెండూ ముందు విడదీయండి" అని కాసేపాగి "మావాడు పొడుగు. మీ అమ్మాయి పొట్టి. ఇది జరగదు" అన్నాడు భాస్కరం.

"ఏమిటమ్మాయ్, మీ ఆయనిలా మాట్లాడుతున్నాడీరోజు. నువ్వు పొట్టి కాదూ ? తను పొడుగ్గాదూ ? నీకన్న పొట్టిగా వుంటుందా మా అమ్మాయి. తనంతేకద మీ మేనల్లుడు !"

"అవుననుకోండి" నొచ్చింది శ్యామల.

"అయితే మరింకేమిటి ? కనుముక్కు తీరు లోపంలేదుకద మా అమ్మాయికి. దీపంలాంటి పిల్ల."

"మీ కంటికి" అన్నాడు భాస్కరం.

గభాలున అతనివంక తిరిగి "అదేమిటి, నువ్వేకదుటయ్యా మా అమ్మాయిని 'దీపంలా ఉంటుంది మీ అమ్మాయికేమండి' అంటావు" అన్నాడాయన.

"అన్నాను. కాదనను. కాని అప్పుడు నిజం మాట్లాడలేదు. ఇప్పుడు నిజమే చెబుతున్నాను. మీ అమ్మాయి చూసేవాళ్ళకి బావుండదు."

శ్యామల ఖంగారుపడిపోయింది. "బాబాయిగారూ, తరువాత మాట్లాడుకుందురుగాని ముందాయన్ని స్నానం చేయనీయండి. ఆయన మేనత్త కూతురూ వాళ్ళు వస్తారుకూడా !"

అయితే ఆయన కదల్లేదు. "మా అమ్మాయి బావుండదా ?"

"అవును బావుండదు."

"ఏమీ బావుండదా ?"

"పాస్ మార్కులు కూడా రావు."

"ఒహో మనం లెక్చరర్లం కద! ఎన్ని వేస్తావేమిటి దానికి మార్కులు ?"

"ఇరవయి, ఇరవయి అయిదు మధ్య."

"నాకో ?" హేళనగా అడిగాడాయన.

"మీకూ అన్నే. ఆ అమ్మాయి అచ్చం

# నిజం

మీ పోలికే !"

"నీకెన్ని వేసుకుంటావు ?"

"ఏభయి అయిదు."

"అయితే నువ్వు బావుంటావన్నమాట !"

"బాగు అన్నది రెలెటివ్. చాలామంది కన్న బావుంటాను అని మాత్రం చెప్పగలను."

నవ్వింది శ్యామల. "వాల్యుయేషన్ కరెక్ట్ గానే ఉందిగాని, లేవండి బాబు స్నానానికి."

లేచి నిలబడ్డాడు భాస్కరం. అతనికీ ఆయనతో మాట్లాడటం ఇబ్బందిగానే ఉంది.

"తనకి తను మార్కులేసుకునేప్పుడు ఎవ్వరయినా ఇంతేలే ! అవునూ ఈ 'నిజం' మాట్లాడటం ఎప్పటినుంచో మనకి ?"

"ఇదివరకూడా పెద్దగా అబద్ధాలు చెప్పినవాడినికాను నేను. ఈరోజు నుంచీ మాత్రం నిజం తప్ప మరోమాట మాట్లాడను."

"అయితే నేనెటువంటి వాడిని ?"

"ఏమిటి బాబాయిగారు మీరు కూడా, ఆయనేదో చాదస్తం ముదరెడితే రెచ్చకొడతారు ? రండి మహానుభావా స్నానానికి."

"ఆగవమ్మా. చెప్పవయ్యా నేనెటువంటి వాడిని ?"

"డబ్బు యావ మీకు. సంపాయించిన దానితో తృప్తిపడరు. ప్రతిదీ డబ్బు చుట్టూ తిరుగుతోందనుకుంటారు. డబ్బుతో కొనలేనివి వున్నాయని గ్రహించి దెబ్బతింటారు."

"మాఆవిడ ఎటువంటిది ?"

"మంచిది. మీరంటే భయం పాలు ఎక్కువ. ఆవిడకి పుణ్యకార్యాలకి ఖర్చుపెట్టాలని వుంటుంది. మీ నోటికి ఝడిసి వూరుకుంటుంది"

"నీకు నేనంటే గౌరవమా భయమా?"

"రెండూ లేవు. అనవసరంకూడా. మీకు డబ్బవసరం. నాకు ఇల్లు అవసరం. ఇచ్చి పుచ్చుకుంటున్నారు."

కాసేపు ఎవరూ మాట్లాడలేదు. తరువాత "నేను కనుక వూరుకుంటున్నాను. మరొహడయితే ఒక నెల టైం ఇచ్చేవాడు ఇల్లు ఖాళీ చేసేందుకు. నేనయినా ఆడుగో ఆవిడ్ని చూసి ... చూడమ్మా శ్యామలా, పిచ్చి కుదిరింపి, రోకలి తలకి చుట్టండి అన్నట్టు వెనకటి కిటువంటివాడే ! పిచ్చి ముదురుతోందని నా అనుమానం. లేదూ నిజంగానే చాదస్తం అయితే నయానా భయానా చెప్పి ఈ అలవాటు మార్పు. లౌక్యం వుండాలి దేనికయినా. సూర్యుడ్ని ఎవరూ నేరుగా చూడరు, చూడలేరు. రంగుటద్దాల్లోంచిగాని, మసిబూసిగాని చూస్తారు. నిజం కూడా అలాంటిదే. ఎండకన్నా నీడలో సుఖం వుంది.

భాస్కరంగారూ, మీ మేనల్లుడ్నే మీకూడా తెలియకుండా ఖాయం చేయగలను మా అమ్మాయికి. కాని చేయను. కారణం అతనికూడా ఇటువంటి వెర్రే వుంటే పిల్లదాని గొంతు కోసినవాడినవుతాను" అంటూనే వెళ్లిపోయాడాయన.

"ఇప్పుడు తమరు చన్నీళ్ళు పోసుకున్నా అవి వేడెక్కిపోతాయి. అంత వేడిగా ఉంటుంది శరీరం. పదండి పదండి" అంటూ శ్యామల లోపలికి దారితీసింది. భాస్కరం కదలలేదు.

"ఈరోజే మీ మేనత్తగారి అమ్మాయి, ఆవిడ పేరేమిటి ? ..."

"సునంద."

"ఆఁ, సదరు నందగారు రావడం. బావగార్ని చూసేందుకు వస్తోందికద. త్వరగా స్నానం ముగించుకుని ముస్తాబయి కూర్చోరూ మరి ! పదండి" అంది శ్యామల. భాస్కరం కదిలాడు.

మధ్యాహ్నం కాఫీలవేళకి వచ్చారు సునంద, ఆమె భర్త రావుగారు. వస్తూనే "మీ పెళ్లికి రాలేకపోయాం బావా, మీ ఆవిడ ఎలా వుంటుందా అని చాలా చాలా ఊహించాననుకో. నిజమండీ — మీ పేరు శ్యామలే కదూ" అంది సునంద.

"మీ ఊహల్లో ఉన్నట్టు లేను కదూ !"

"ఎలా కనుక్కున్నారు ? నిజమే మీరన్నది."

నవ్వింది శ్యామల. "వివేకానందుడి కథ ఎవరో చెప్పారులెండి. మనిషి దేముడిని గురించి ఊహించేప్పుడు తనలాంటి ఆకారాన్నే మరింత అందంగా ఊహిస్తాడుట. అదేకనక గేదెకి దేముడ్ని గురించి ఊహించే శక్తి ఉంటే మరింత పెద్ద పెద్ద కొమ్ములతో ఇంకొంచెం నల్లగా ఉండే గేదెలా ఉంటాడని ఊహించుకుంటుందిట. అంటే మనమెలా ఉంటామో మన ఊహ కూడా దాని పరిధి లోనే ఉంటుంది. మనం ఎరగనిదానిని మనం ఊహించలేము కద !"

## నిజం

సునంద కూడా నవ్వేసింది. "ఇంతకీ నేను మనిషినా, గేదెనా మీ ఉపమానంలో – ఏదంటారు ?" అంది నవ్వుతూనే.

"ఛ, ఛ అప్సరసలా మీరుంటే అంత మాట అంటానుటండి ? మీరు పొడగ్గా ఉన్నారు. కనుక నేనూ అలానే ఉంటానని ఊహించుకుని ఉంటారు. అవునా ?" అడిగింది శ్యామల.

"కరెక్ట్" ఎవ్వుతూ అంది సునంద.

"మన సంభాషణల్లో పడిపోయి అన్నయ్యగారికి ఏంకావాలో మరిచేపోయాం."

"ఆయనకేమీ అక్కరలేదు. వాళ్ళాఫీసు ఈ ఊళ్ళో ఎక్కడుందో చెబుతే చాలు. ఇక్కడే కాదు. ఏ వూరెళ్ళినా ఆయన క్కావలసిందదే! అక్కడికి వెళ్ళిపోయి సరిగ్గా మవం బయలుదేరే వేళకి వస్తారు. నేనాయనకి రెండవ భార్యని" అని నవ్వి "అర్థమయిందిగా మొదటిది వాళ్ళ ఆఫీసు" అంది.

"ఆయన అడగటం, నేను చెప్పడం – వారు వెళ్ళిపోవడం అన్నీ జరిగిపోయాయి సునందా! 'ఏమీ అనుకోకండి' అన్నాడు. అనుకోనని చెప్పాను. ఇన్‌ఫాక్ట్ – ఆయన గురించి నువ్వు చెప్పింది రైటేలావుంది. రావడమే ఆఫీసు విషయాలు మొదలెట్టాడు" అన్నాడు భాస్కరం.

"అవును బావా, ఒక ముద్దూ ముచ్చటా ఏమీ ఉండవు. 'డాలీ నీకింకేమయినా కావాలా ?' అంటారు మాట్లాడితే. కొండ మీది కోతి కావాలంటే ఆ కొండనీ, కోతినీ రెంటినీ ఇచ్చేసి 'అమ్మయ్య' అనుకుని వెళ్ళిపోతారు వాళ్ళ ఆఫీసు ముఠాలోకి. సరే ఆ ఆఫీసుకి వెళ్ళాక వాళ్ళ బ్రాంచీలు, ప్రమోషన్లు, క్రిందివాళ్ళని తనే రకంగా కంట్రోల్ చేసిందీ – ఇవీ కబుర్లు. ఆఫీసు కారుని, ఆ మానేజర్ని వెంటేసుకు ఇంటికి రావడం 'డాలీ, ఇంకేమన్నా కావాలా' అనడగడం, రాత్రి పడుకునే వేళకి చేరుకుంటారు."

"డాలీ ఏమిటె ?" అన్నాడు చిరాగ్గా భాస్కరం.

పక పక నవ్వింది సునంద. "అదికాదు బావా! నేను డాల్‌లా అంటే బొమ్మలా ఉంటానుట. ఆ బొమ్మ అలానే ఉండాలిట! అందుకని నాకు దిగుళ్ళూ, కోపాలూ ఏవీ రాకూడదుట."

భాస్కరం మాట్లాడలేదు. శ్యామలకి మాత్రం అంతెత్తు మనిషి, భర్తని గురించి 'ముద్దు, ముచ్చటా లేదు' అనడం ఎబ్బెట్టుగా అనిపించింది.

"రాత్రి పదికి మా ట్రయిన్. బొంబేలో కాన్ఫరెన్సుట..."

"ఏమిటె ఈ రాత్రికే – మీరుండండి పోనీ. ఆయన వెళ్ళివస్తారు."

"అమ్మో! మీకు తెలియదు శ్యామలగారు, సొసైటీలో ఆడది పక్కన వుండాలి. మళ్ళీ సరదాలకి ఏకాంతాలూ కావాలి. మా బావ రాములవారిలాంటి వాడు కనుక మీ పని హాయిగా వుంది."

సాయంత్రం శ్యామలకి పేరంటం కార్యక్రమం ఒకటి తగిలింది. 'రాకపోతే నామీద ఒట్టే' అని చేయి గిల్లి మరీ వెళ్ళింది దుర్గ. పైగా ఆమెకీ పేరంటంకి వెళ్ళడం ఇష్టం. ఇంట్లో సునందని వదిలి వెళ్ళడం సభ్యత కాదు. పేరంటానికి రావడానికి ఆమె ఇష్టపడకపోవచ్చును.

ఆమె పడుతున్న బాధ గ్రహించింది సునంద. "మీరు వెళ్ళిరండి! నేను – రావడం అభ్యంతరమని కాదు – నాకూ చిన్నప్పుడు సరదానే కాని ఎవ్వరినీ ఎరగను కద! ... సో ... మీరు వెళ్ళిరండి. మా బావతో కబుర్లు చెప్పుకుని చాలాకాలం అయింది. ఏం బావా, నీకు పనేమయినా వుందా ?"

"లేదు. నువ్వింట్లో వుంటానంటే పని వున్నా వెళ్ళను."

ముందు గదిలో కూర్చునివున్నారు. ఒకసారి వాళ్ళవంక చూసి "వంటింటి తలుపు దగ్గరగా వేశాను. భయమేమీ లేదనుకోండి. పనిమనిషి మళ్ళా వస్తానంది, టిఫెన్ ప్లేట్స్ అవీ కడిగేందుకు. నేను వెడుతున్నాను. ఒక గంటలో వస్తాను అప్పటిదాకా బావామరదళ్ళు మాట్లాడు కోండి" అని నవ్వి బయటికి వెళ్ళిపోయింది.

భాస్కరం భార్య వెళ్ళినవైపు చూసి సునందవైపు చూశాడు. "నీకు ఒళ్ళొచ్చింది సునందా" అన్నాడు నవ్వుతూ.

"బెలూన్‌లా వున్నానంటావు."

"ఛ, నువ్వు ఆడవాళ్ళల్లో చాలా పొడుగు తెలుసా ?"

"అవును. ఐ నో ఇట్."

"మరి నీకెంత లావొస్తేమాత్రం భయమేమిటి? అయినా అంతగా రాలేదు కూడా. చాలా కొంచెంగా - నీ శరీరం బాగా పరిచయం వున్నవాళ్ళకే తెలుస్తుందన్న మాట."

"అంటే?" అతని ముఖంలోకి చూస్తూ అంది సునంద.

"అంటే – ఐ మీన్ – నీ పొడుగు వగయిరా బాగా తెలిసినవాళ్ళు."

"మా ఆయన ఎప్పుడూ అనలేదు ఆమాట" అని నవ్వింది.

"దెన్ ఐ మే బి రాంగ్. నా ఉద్దేశం తప్పు కావచ్చును."

"కాదు, నువ్వు చెప్పిన మాట నిజమే. నా శరీరంతో నాకు బాగా పరిచయమేకద! ఫొటో దిగినట్లు నా మనసులో ఎప్పుడూ మెదులుతూనే ఉంటుంది కద! నీకూ అంతగా గుర్తుంటేనే చెప్పగలవు నువ్వు కూడా!"

"రైట్. అంతగానూ గుర్తున్నావు" అన్నాడతను.

అంతలో చప్పుడేదో అవడంతో "వంటింట్లో చప్పుడయినట్లుంది. చూసి రానా ?" అడిగింది సునంద.

"నో. చెప్పిందిగా శ్యామల, పనిమనిషి వస్తుందని. అయినా లెట్ ఆల్ అదర్ థింగ్స్ గో టు హెల్. అలా కూర్చో నాకెదురుగా. చాలు."

కాసేపు అతనివంక చూసి "మా ఆయన నాకు మాచ్ అయాడంటావా పొడుగులో ?" అనడిగింది.

"ఎంత మాత్రం కాదు. 'వరహీనం' కాని పొజిషన్ – మైగాడ్! అతనితో ఇంటర్వ్యూ కావాలంటే గంట వెయిట్ చేయాలి నాలాంటివాళ్ళు తెలుసా ?"

"నేనూ రాత్రి పదింటిదాకా వెయిట్ చేయాలి. నీకు తెలుసా అది ?"

భాస్కరం మాట్లాడలేదు.

"ఏం బావా, సూటిగా ఒక్క మాట అడుగుతాను. నేనంటే నీ కిష్టంలేదా ?"

"చచ్చే ఇష్టం."

"మరి..." ఆమె గొంతు గాద్గదికం అయిపోయింది. "మరి నన్నుగురించి డాడీతో ఎప్పుడూ ఎందుకు మాట్లాడలేదు బావా ?"

భాస్కరం తలవంచుకున్నాడు.

[ 42వ పేజీ చూడండి ]


మీరు అందమయిన
దుస్తులు ధరిస్తే చాలా?
మీ ముఖ సౌందర్యాన్ని
పెంపొందించుకోవాలి!
మీ ముఖం అందంగా
వుండడానికి... పాండ్స్ ఫేస్ పౌడర్
మృదుత్వమే కారణం.
అది మీ ముఖానికి మృదుత్వంతో
అనమానమయిన కళనీ తీసుకు
వస్తుంది. ఆ కళ అలాగే
వుంటుంది. గంటల తరబడి...
గంటల తరబడి...
FACE POWDER
Pond's
FACE POWDER
పాండ్స్ ఫేస్ పౌడర్
అనుపమ ముఖసౌందర్యానికి అద్వితీయమయినది
Pond's
CP-1462

సీరియల్:

# సుదూర తీరాలు

## పాటిబండ్ల విజయలక్ష్మి

**"మల్లీ! మల్లీ! ప్లీజ్ మల్లీ! నిన్ను మళ్ళీ అడగనుగా! ఈ ఒక్కసారికి పాడవా మల్లీ!"**

**పొలం గటుమీద వేగంగా పరుగెడుతూ మధ్య మధ్య వెనక్కు తిరిగి చూస్తూ, కిలకిలా నవ్వుతూ తన కందకుండావున్న మల్లి వెంట పరుగెడుతూ ప్రాధేయపడుతున్నాడు మాధవ్.**

వెనక్కు చూస్తూ పరుగెత్తడంలో కాలు మడతపడ్డ మల్లి గట్టుమీద పడిపోయింది. లేచి మళ్ళీ పరుగెత్తే ప్రయత్నంలో వుండగానే మాధవ్ చేతికి చిక్కింది మల్లి అందమైన జడ

"ఊఁ! యిప్పుడెక్కడికి పోతావు? నాకు దొరక్కుండా తప్పించుకుందామనే వో, నెవర్. నానుంచీ నువ్వు తప్పించుకోలేవు మల్లీ!" అంటూ నవ్వుతూ తనూ మల్లి ప్రక్కనే కూలబడ్డాడు మాధవ్, తన చేతుల్లో చిక్కిన మల్లి పొడవాటి జడను చేతికి చుటుకుంటూ.

'ఊఁ! పేద్ద! పట్టుకున్నావులే! నేనసలు పారికేదాన్నేమిటి? కాలు మడతపడబట్టి, పట్టుకో లిగావు" అంటూ నవ్వింది మల్లి

అందమైన ఆ ముఖం, తళతళా మెరిసే ఆ కళ్ళూ, అమాయకమైన మాటలు, మల్లెపూవు లాంటి స్వచ్ఛమైన ఆ మనసూ మాధవ్ భావి జీవితానికి వెన్నెల బాటలుగా అనిపిస్తుంటే చెప్పవాల్సిందంకూడా మరచి ఆ ముగ్ధమోహన ముద్దబంతిని అలాగే కొన్ని క్షణాలు చూస్తుండి పోయాడు

మనోహరమైన మాధవ్ చూపులకు మనసు ఏదోలా కరిగిపోతుంటే —

"ఊఁ! ఆ పేపరిలా యివ్వు బావా! తప్పుతుందా మరి, నీ భావగీతాలు నేనే పాడాలని బ్రహ్మ వ్రాసిపెడితే పాడకేం చేస్తాను" అంటూ మాధవ్ చేతిలోని పేపర్ తీసుకుంది, చిన్నగా నవ్వుతూ మాధవ్ చూపులనుంచీ సిగ్గుగా తన చూపులు తప్పిస్తూ.

అప్పటికి బాహ్య స్పృహ కలిగిన మాధవ్,

"మల్లీ! వారానికి ఓ పాట వ్రాయడం, అది రాగానే నీ నోట వినడం, బాగా అలవాటయి పోయింది. ఆ రోజులనుంచీ వున్న అలవాటు అకస్మాత్తుగా ఎలా పోతుంది?

ఏదైనా ఓ వారం పనిబడి మన వూరు రాలేకపోతే, నీ పాట వినలేకపోతే, మనసంతా శూన్యంగా వుంటుంది. మళ్ళీ ఆదివారం ఎప్పుడొస్తుందా, నీ నోట నా పాట ఎప్పుడు వింటానా అని నాకే తెలీకుండా నా మనసు ఎదురు చూస్తుంది.

అందుకే మై డియర్ మరదలుపిల్లా! నా భావ గీతాలు, అదే నీ బావ గీతాలు నువ్వు పాడక తప్పదు. బుద్ధిమంతురాలిలా అడగ్గానే పాడితే ఎంత బావుంటుంది? ఊఁ! క్విక్ స్టార్ట్!" అంటూ నవ్వుతూ పేపర్ మల్లిక చేతిలోనే వుంచి, తనూ ఓ వర పట్టుకున్నాడు పోరకంట మల్లినే చూస్తూ.

"ఓహో యిదంతా పాటమీద ప్రేమన్నమాట నీ మాట నేను వినకపోతే బలిమాలో అధికారం చెలాయించో ఆ పని చేయించుకుంటావు. కానీ నేను చెప్పిన మాట వినవు. అది నీ మేనేజర్ హోదాకి భంగం అవునా?" అంది మల్లి చిరుకోపంగా మాధవ్‌ను చూస్తూ.

"ఏయ్! పిచ్చిమొద్దూ! నాకు పాటమీద ప్రేమో, నీమీద ప్రేమో నీ మనసుకు తెలుసుగానీ వూరికే గొడవపెట్టకుండా శ్రావ్యంగా ఆ పాట పాడి వినిపించు. నా చెవుల తుప్పు వొదిలిపోతుంది. మళ్ళీ వారం వరకూ నిన్నడిగితే ఒట్టు" అంటూ మల్లి చేతిలో ఒట్టువేసి చిన్నగా గిల్లాడు మాధవ్.

"అబ్బ! ఎలా మాట తప్పించేస్తావో. నీమాత్రం తెలివి నాకు లేదనేగా. ఎన్నిసార్లు చెప్పాను బావా! హాయిగా దొరబాబులా డ్రెస్ వేసుకోమని. ఒక్కసారంటే ఒక్కసారి నా మాట విన్నావా? ఎప్పుడూ తెల్లటి పంచె, గ్లాస్కో లాల్చీ తప్ప వేసుకోవు. నిన్ను పాంటూ షర్ట్ వేసుకుంటే చూడాలని నా కోరిక. నువ్వేమో పూర్తిగా విరుద్ధం. అసలు నువ్వీ డ్రెస్ వేసుకుంటే మీ ఆఫీసు వాళ్ళైనా ఏమీ అనరా? ఎప్పుడు చూసినా పల్లెటూరి రైతు వేషం తప్ప వేయవు. అసలెవరైనా నిన్ను డిగ్రీహోల్డరనీ, అంత పెద్ద కంపెనీకి మేనేజర్‌వనీ అనుకుంటారా?" ఉక్రోషంగా దులిపేస్తున్న మల్లి మాధవ్ లేచి నుంచోవడంతో వెంటనే మాధవ్ చేయిపట్టి లాగి కూర్చోబెట్టింది.

"అదేమంటే వూరుకుంటావు. మాటలు మానేస్తావు. సరే కానీ... ఆ బుద్ధి నీకు పుట్టాలిగానీ, నే చెబితే ఎందుకు వింటావు? మళ్ళీ ప్రొద్దునే వెళ్ళిపోతావు. వారందాకా దర్శనం కాదు అలా ముఖం మాడ్చుకొని వుండకు. మళ్ళీ వారందాకా ఈ ముఖమే జ్ఞాపకం వస్తుంది" అంటూ పేపర్‌లోకి చూస్తూ రాగాలాపనలో మునిగిపోయిన మల్లిని చూసి చిన్నగ నవ్వుకున్నాడు మాధవ్.

*       *       *

అందంగా అల్లరిగా గంతులేస్తూ తనను పల్లెటూరి రైతులా వున్నావని వెక్కిరిస్తున్నా అంతరాంతరాల్లో తనంటే అత్యంత అనురాగాన్ని నింపుకున్న మల్లంటే, వల్లమాలిన అభిమానం, ఆత్మీయత మాధవ్‌కు.

మల్లి గొంతు విప్పి తను వ్రాసిన భావగీతాలు పాడుతుంటే ఎంతసేపైనా అలా సమస్త ప్రపంచాన్నీ మరచి ఆ పాటలు వింటూ వుండిపోగలడు. అపరంజిబొమ్మలాంటి అందం, అంత పొడుగూ, పొట్టీకాని ఎత్తుతో, అందంగా ఓ మహాశిల్పి చెక్కిన శిల్పంలాంటి కనుముక్కు తీరుతో, సప్తస్వరాలూ ఆ గొంతు నుంచే పుట్టినట్లు ఏ సాధనా లేకుండానే, అందంగా తీగలా సాగే ఆ గానవాహినంటే చిన్నా పెద్దా ఆ ఊళ్ళో అందరికీ ఎంతో ఇష్టం. దశరథరామయ్య మాష్టారుకు మరీ యిష్టం. ఇంక, ఆయన కొడుకు మాధవ్‌కు మల్లి అనురాగవల్లి.

ఉద్యోగంరీత్యా పల్లెకు దూరమైనా, పల్లెలంటేనే మొదటినుంచీ అత్యంత అభిమానం. ఏదో తెలీని ఆత్మీయత మాధవ్‌కు. అందుకే ఆఫీసు సెలవైన ఆదివారం తమ పల్లెకు చేరుకోకుండా వుండలేదు. అంతక్రితం ప్రతి సాయంత్రం కృష్ణ ఒడ్డున కూర్చొని



అప్తమిమ్ముప్న మాధుర్యబింబాన్ని చూస్తూ మల్లి పాటలు వింటూ, మధ్య మధ్య మల్లితో గిల్లికజ్జాలాడుతూ, హాయిగా నిశ్చింతగా గడిపేవాడు. వాళ్ళ దినచర్య రోజూ చూసే చిన్నాపెద్దా వాళ్ళిద్దరినీ కాబోయే భార్యాభర్తలుగానే వూహించుకున్నారు.

మున్సబుకు మాత్రం ఆ జంటను చూస్తే కంటగింపుగా వుండేది. మాధవ్, మల్లికి బావ కాదు. కనీసం దూరపు చుట్టరికంకూడా లేదు. చిన్నప్పటినుంచీ మాధవ్‌కు మల్లి అమ్మగారిని అత్తయ్యా! అని పిలవడం అలవాటు. ప్రక్క ప్రక్క యిళ్ళలో వుండటంవల్ల మగదిక్కులేని అన్నపూర్ణమ్మ ఏ విషయంలో సలహా కావలసి వచ్చినా "అన్నయ్యా!" అంటూ దశరథరామయ్య గారితోనే సంప్రదించేది. అలా ఆ రెండిళ్ళూ దగ్గిరయ్యాయి. అలాగే మల్లి మాధవ్ చిన్నప్పటి

## కొత్త సీరియల్ ప్రారంభం!

మంచీ ఒక్కటిగా పెరిగి పెద్దవాళ్ళైనారు. దశరథరామయ్యగారు ఆ వూళ్ళోనే స్కూల్ మాస్టరు. మల్లి నెలల పిల్లగా వుండగానే తండ్రిని పోగొట్టుకుంది. తల్లే అన్నీ అయి పెంచింది. ఊళ్ళో అందరికీ తలలో నాలుకలా మెదిలేది. ఎవరికే సహాయం కావాలన్నా అన్నపూర్ణమ్మనే పిలిచేవారు. దానికి తగ్గట్టు ఎంతో కొంత, ఏదో రూపంలో ముట్టజెప్పేవారు. ఒక ఎకరం పొలం వుంది. దానిమీద వచ్చే ఆదాయం వాళ్ళిద్దరికీ సరిపోయేది.

మల్లికి దశరథరామయ్యగారి దగ్గరే అక్షరాభ్యాసం. ఆ వూళ్ళోవున్న స్కూల్లోనే స్కూల్ ఫైనల్ వరకూ చదువుకుంది. చిన్నప్పడైన అలవాటు పెద్దైనా మానలేక పోయింది. మాస్టర్‌గారిని "మాష్టర్లూ!" అని పిలిచినా, మాధవ్‌ను మట్టుకు "బావా!" అనే పిలిచేది.

మాధవ్ పట్నం వెళ్ళి చదువు పూర్తిచేయడం, ఆ వెంటనే మంచి ఉద్యోగం దొరకడం, వెంట వెంటనే జరిగిపోయాయి. తనకు ఉద్యోగం దొరకగానే తండ్రిని తనతో పట్నం తీసుకెళ్ళాలనుకున్నాడు. కాని ఆయన అందుకు అంగీకరించలేదు. మొదటినుంచి అలవాటైన ఆ వూరిని వదిలి

[ 38వ పేజీ చూడండి ]



# తారాజువ్వలు

## మురళీమోహన్

పోయిన దీపావళినాడు మాత్రం తీరుబడి దొరికి, ఇంట్లో హాయిగా కాలక్షేపం చేయడానికి వీలయింది నాకు. ఇద్దరు ఫాన్స్ (యువతులు) హైదరాబాద్ నుంచి వచ్చినవారల్లా నన్ను చూడ్డానికి మా ఇంటికి వచ్చారు వచ్చినప్పట్నుంచి పత్రికా విలేఖరులకుమల్లే నామీద ప్రశ్నల వర్షం కురిపించసాగారు హాలిడే మూడ్‌లో ఉన్నా — ఓపికగానే జవాబులివ్వసాగాను చివరికి వాళ్ళకే విసుగెత్తినట్లుంది — "ఇక చివరికి ఒకే ఒక ప్రశ్న అడుగుతామండి," అంది ఓ యువతి "దయచేసి మీ పుట్టినరోజు ఎప్పుడో చెప్తారా?" రెండవ వనిత అడిగింది నా వయస్సెంతో తెలుసుకోవాలన్న కుతూహలం వాళ్ళిద్దరి ముఖాల్లో బాగా ద్యోతక మౌతోంది.

"జూన్ 24న," అన్నాను.

"ఏ సంవత్సరంలో?" అని ఇద్దరూ ఒకేసారి అడిగారు.

"ప్రతి సంవత్సరం జూన్ 24నే నా పుట్టిన రోజు..." అన్నాను

అంతే. దాంతో ఆ అమ్మాయిలిద్దరూ తెల్లబోయి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. "థాంక్సండీ. చివరికి ఒకే ఒక ప్రశ్న అడుగుతామంటూ రెండు ప్రశ్నలు అడిగేశాం. ఇక అడగడం బావుండదు... వస్తామండి," అంటూ నాకు దీపావళి శుభాకాంక్షలు అందజేసి, నా ప్రత్యభినందనలు అందుకొని, చల్లగా జారుకున్నారు.





శ్రీదేవి 'కళ్యాణ రాముడు'లో

[illegible] చిత్రం దోనేపల్లి మురళి

# దీపావళి సినిమా

### మంగళతోరణాలు

### మామా అల్లుళ్ళ వాగ్వాదాలు

సుభద్ర ముంగురులు సవరిస్తూ అర్జునరావు "సుభద్రా! నువ్వు చిరునవ్వులు చిలికిస్తూ నా కళ్ళెదుట ఎప్పుడూ కనిపిస్తూ వుంటే, ఈ వెదురుకుడు లెక్కేముంది — జీవితంలోనే నేను వెదుగుడు ఆడగలను," అంటూండగా అక్కడి కొచ్చిన బలరామయ్య అగ్గి అయిపోయాడు. "ఎంత గుండెధైర్యంరా నీకు? నా చెల్లెలితోటి సరసాలాడ్తావా?"

"నా మేనమామ కూతురు. సాగించే అధికారం, హక్కు నాకున్నాయ్."

"పిచ్చిపిచ్చిగా మాట్లాడకు పెళ్ళి కావల్సిన పిల్ల ఇకమీద కన్నెత్తి చూశావో — నీ మెడ మీద తలకాయుండదు నేను తలచుకుంటే ఏమైనా చెయ్యగలను ముష్టెత్తుకునేలా చెయ్యగలను"

"డెబ్భై ఎకరాల పొలంతో మీ చెల్లెలు నాకు భార్యగా వస్తూంటే, ముష్టెత్తుకోవలసిన కర్మ నాకేమిటంట! ఆ దుస్థితి నాకెప్పుడూ రాదు."

"నువ్వు చచ్చి ముతవారినా నా చెల్లెల్నిచ్చి నీకు పెళ్ళి చేయను."

"నువ్వు చెయ్యకపోతే మేమే స్వయంగా చేసుకుంటాం."

"ఒరే — ఒరే! నేనంటే ఏమనుకుంటున్నావ్ — మీసం మెలేశానంటే, శిలాశాసనం కావల్సిందే!"

"నేను మసాలా వేశానంటే — వషాలం అంటవల్సిందే!"

"నోటికొచ్చినట్లల్లా పేలకు. తప్పు తెలుసుకొనిఎప్పటికైనా నా కాళ్ళు పట్టుకోవలసి వస్తుంది — గుర్తుంచుకో."

"నువ్వెప్పటికైనా నా కాళ్ళుకడిగి కన్యాదానం చేయవలసివస్తుంది. అదీ నువ్వు గుర్తుంచుకో!" అని అర్జునరావు (చంద్రమోహన్) అంటే, "అదే — అదేమిటో చూద్దాం," అని విసురుగా వెళ్ళిపోయాడు బలరామయ్య (జగ్గయ్య).

సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో పి. వి. రమణయ్య సమర్పించే కృష్ణ—షా ఫిలింస్ "మంగళతోరణాలు" వర్ణం చిత్రం చివరి షెడ్యూల్ సెప్టెంబర్ 9న పూర్తయింది. ఈ చిత్రం షూటింగంతా చిత్తూరు ప్రాంతంలో జరిగింది. తాళ్ళూరి రామేశ్వరి, పల్లవి, పి. ఆర్. వరలక్ష్మి, కాకినాడ శ్యామల, సత్యనారాయణ, నాగభూషణం, నూతన్‌ప్రసాద్, విజయ్ ప్రభృతులు పాత్రధారులు దాసం గోపాలకృష్ణ రచయిత కృష్ణ—షా నిర్మాతలు

—జి. వి. జి.

## జయప్రద

మా ఇంటికి అన్ని పత్రికలూ తెప్పిస్తూంటాం. దీపావళి రోజు ఉదయమైతే ఇక చెప్పక్కర్లేదు — విశేష సంచికలతోపాటు బోల్డు పత్రికలు టేబుల్ మీద ఉంటాయి

మేం నుంగంబాక్కం బంగళాలో ఉన్నప్పుడు జరిగిన ఒక సంఘటన : ఓసారి దీపావళి మర్నాడు పక్కనున్న భవంతి నుంచి ఓ బామ్మగారు హడావిడిగా వచ్చి, "అమ్మాయ్, కొంచెం పేపరుంటే ఇస్తావా ?" అంది

"ఈవేళ పేపర్లు రావండి. పత్రికలకు సెలవు కదా ?" అన్నాను.

"పోనీ — నిన్నటి పేపర్ ఏదైనా ఉందా ?"

"నిన్నటి పేపర్లన్నీ మా మేనేజర్ గదిలో ఉన్నట్లున్నాయి ఆ గది తాళంచెవి ఆయన దగ్గరే ఉంటుంది."

"పరవాలేదు మొన్నటి పేపరు ..?"

"మూడాలి", అంటూ ఆమెకు ఏ పేపరు ఎందుకవసరమొచ్చిందో అని జాలిపడి, "వారం రోజుల క్రితం పేపర్లు మాత్రం స్టోర్ రూమ్‌లో ఉంటాయి" అన్నాను.

"ఏదో ఒకటి తెచ్చివ్వమ్మాయ్ ఏదయితేనేం— పిండి జల్లించుకోడానికి," అందామె.

అంతే .. అవాక్కయిపోయాను!

ధర్మం దారి తప్పితే.

'ఛాలెంజ్ రాముడు'లో రామారావు, గీత

## సారథి - కె. వి. చలం

దీపావళి షాపింగ్‌కు సారథి ఒక బట్టల కొట్టులోకి ప్రవేశించాడు — చెవిదగ్గర ట్రాన్సిస్టర్ ఉంచుకొని, క్రికెట్ కామెంటరీ వింటూ కొట్టతను పలకరించి విష్ చేస్తూ, వెంటనే బట్టల వ్యాపారం మొదలెట్టడం బావుండదనుకున్నాడేమో "స్కోర్ ఎంతండి ?" అని పలకరించాడు

"ట్వెంటీ ఫర్ నో లాస్," అన్నాడు సారథి

"అంతేనా ?" అన్నాడు కొట్టతను ఆశ్చర్యం అభినయిస్తూ.

"అంతే ఇది సింగిల్ బాండ్ పాకెట్ ట్రాన్సిస్టర్ కదా — ఇందులో స్కోర్ ఇంతే," అంటూ నవ్వాడు సారథి

"భలే జోక్ వేశారండీ!" అంటూ నవ్విన ఆ కొట్టతను అంతటితో ఊరుకోవచ్చుకదా ? ఊరుకోక "అన్నట్లు గవాస్కర్‌ది ట్వెంటియత్ సెంచరీ కదండీ ?" అని మరో ప్రశ్న వేశాడు.

ఇంతలో ఆ కొట్టులోకి వచ్చిన కె. వి. చలం "గవాస్కర్‌కే కాదు; మనందరికీ ఇది ట్వెంటియత్ సెంచరీయే! ఇది 1979వ సంవత్సరం. అంటే, మనమంతా ద్వితీయ శతాబ్దంలో ఉన్నట్లే కదా ?" అన్నాడు మందహాసంతో.

దాంతో ఆ కొట్టతను ఇక క్రికెట్ గురించి అడగడం మానేసి, వ్యాపారంలోకి దిగాడు.

సారథి, చలం ఒకరి ముఖాలొకరు చూసుకొని నవ్వుకున్నారు

'నా మొగుడు బ్రహ్మచారి'లో హలం



'గోరింటాకు'లో ఒక దృశ్యం

## మోహన్‌బాబు

"నాకు ఫారెన్ వెళ్ళిపోవాలని ఉందండి," అన్నారు మోహన్‌బాబు ఇటీవల నేను కలుసుకున్నప్పుడు

"షూటింగ్‌కా ?" అన్నాను

"కాదండి," అంటూ ఆయన వినుగ్గా ఒక స్కెచ్ తీసి చూపిస్తూ, "ఈ డిజైన్‌ను ఇన్‌లాండ్ లెటర్‌మీద ప్రింట్‌వేసి, అందరికీ దీపావళి గ్రీటింగ్స్‌ను ఒక కొత్త పద్ధతిలో పంపించాలని ఆర్టిస్ట్‌చేత స్కెచ్ వేయించా. మా ఫ్లాట్స్ పక్కనే పెద్ద టి–నగర్ హెడ్ పోస్టాఫీస్ ఉంది ఏం ప్రయోజనం ? అక్కడ ఇన్‌లాండ్ లెటర్స్ లేవట. అందుకే ఏ ఫారెన్‌లాండ్‌కైనా వెళ్ళిపోవాలన్నంత చిరాకు కలిగింది." అంటూ ఆ చిరాకులోనే ఓ జోక్ వేశారు.

## జయశ్రీ ఆర్ట్స్ ఇంటర్నేషనల్

"మంత్రాలయ శ్రీ రాఘవేంద్ర వైభవము" అనే వన్నెల చిత్రాన్ని బొంబాయికి చెందిన ప్రముఖ వ్యక్తి ఆర్ ఎల్. ఎన్. విజయనగర్ తెలుగు, కన్నడ భాషల్లో తెరకెక్కించడానికి నిశ్చయించారు. రామకృష్ణ ప్రధాన పాత్రధారి. ఆయన సహధర్మచారిణిగా చంద్రకళ, వారి గురువులు శ్రీ సుధీంద్రతీర్థస్వామిగా రమణమూర్తి, ఇతర పాత్రలలో మంజాభార్గవి, ఉదయకుమార్ కనిపిస్తారు కన్నడ సాహితీ అకాడమీ అవార్డు గ్రహీత బాబా కృష్ణమూర్తి సమకూర్చిన చిత్ర కథకు సముద్రాల సంభాషణలు రాశారు వైణిక విద్వాంసుడు చిట్టిబాబు స్వరకల్పనలో బాలమురళీకృష్ణ, పి. బి. శ్రీనివాస్, జానకి పాడారు సెప్టెంబర్ 25 నుంచి ఏకధాటిగా శివసముద్రం, తలకాడు, మంత్రాలయం, మైసూర్ ప్రాంతాలలో షూటింగ్ జరుగుతుంది. వారణాసి వెంకట్ ఛాయాగ్రహణంతోపాటు ఎగ్జిక్యూటివ్ నిర్మాతగా వ్యవహరిస్తారు సంక్రాంతికి విడుదల చేయాలని నిర్మాత సంకల్పం







'మూగకు మాటొస్తే' జయసుధ, కవిత

# రేఖ

రెండేళ్ళ క్రితం రేఖ దీపావళి పండుగను మద్రాసులోని తన స్వగృహంలోనే జరుపుకుంది. ఆమెకు శుభాశిస్సులు అందజేయడానికి వెళ్ళినప్పుడు ఆమెతోపాటు ఒక మహిళ ఉంది ఆమెను రేఖ నాకు పరిచయం చేస్తూ, "ఈమె ఒకప్పుడు చర్చిపార్క్ కాన్వెంట్‌లో నా క్లాస్‌మేట్ ఇప్పుడు వివాహమైంది ఈమె హబ్బీ కొత్తగా ఏదో సోప్ ఫ్యాక్టరీ ప్రారంభించారు," అంది

ఆ మహిళ విప్పారిన ముఖంతో "రేఖ ఇంత పెద్ద స్టార్ అయినా ఏమాత్రం మారలేదు. నన్నింకా జ్ఞాపకం పెట్టుకొని వుండడం ఎంత గొప్ప విషయం! మా సోప్ ప్రకటనలను తొలసారిగా దీపావళి విశేష సంచికల ద్వారా విడుదల చేయాలనుకున్నాం ఆ అడ్వర్టయిజ్‌మెంట్లలో ఈమె ఫోటో వేసుకోవాలనుందని కోరితే, వెంటనే అనుమతిచ్చింది," అంటూ ఒక తమిళ దీపావళి విశేష సంచికను తీసి, అందులోని ప్రకటనను చూపించింది రేఖ "ఏదీ?" అంటూ ఆ పత్రికను అందుకొని, "నాది మంచి ఫోటోనే సెలెక్టు చేశారు కాని" అంటూ నొసలు చిట్లించి, 'నేనెల్లప్పుడూ ఈ సోప్‌నే ఉపయోగిస్తా'నని రాయించారేమిటి ఈ డిజైన్‌లో? నేనెల్లప్పుడూ ఎందుకు ఉపయోగిస్తాను? స్నానం చేసేటప్పుడే ఉపయోగిస్తాను — అని వుండాలికదా?" అంది నవ్వుతూ

"ఐ యామ్ వెరీసారీ...తదుపరి ప్రకటనల్లో అలా మార్పిస్తాలెండి," అన్నదామె స్నేహితురాలు.

"అబ్బే! ఫరవాలేదు — ఊరికే జోక్కు అన్నాలెండి," అంది రేఖ.

## పరోపకారి పాపన్నలో మిడిమేల వారి టి ఆడ డుచు చుకలు

చేసేవి శివపూజలు, దూరేవి సందుల్లో అన్నట్లు — ఎప్పుడూ 'రంగా, పాండురంగా' అని ధ్యానించే పూజారి గంట పంతులికి — రంగు చీర కనిపించినా, వయసుపిల్ల పొడసూపినా — ప్రాణం రెపరెపలాడిపోతుంది ఓరోజు స్కైకిలెక్కి పిల్ల(ల) గాలికి చల్లగా షికారు బయలుదేరిన ఆ పూజారికి చంద్రి కంటబడింది. అలవాటయిన ప్రాణం — ఎలా ఆగుతుంది? "అమ్మాయ్, కాస్త ఆగు ... నువ్వు — నువ్వు.. "

"నేను ... నేను నేనే!"

"ఆహా! ఎక్కడో చూసినట్టుంది," అంటూ మెల్లగా వెంటబడ్డాడు

చంద్రి కూడా ఏం తక్కువైన పిల్లకాదు. ఎవర్ని ఎలా ఏడ్పించాలో బాగా తెలుసు అందుకే "ఆఁ.. చూసేవుంటారు మొన్న మా ఇంట్లో పిల్లికి సీమంతం చేశాం పేరంటానికి పదిమంది ఆడంగుల్ని పిలిచాం వాళ్ళతో మీరూ వచ్చి వుంటారు," అంటూ చురక గట్టిగానేపెట్టింది.

కాని, పంతులు అదేం పట్టించుకునే స్థితిలో లేడు "హి..హి...హి.. దోరకాయలాగున్నావ్ కాని, చాకులాంటి మాటన్నావ్ ఇంతకీ, ఎవరి అమ్మాయివి?" సరసంగా మరింత దగ్గరయ్యాడు

"మిడిమేలంవారింటి మూడో పడుచుని. చీపురుకట్ట సందులో చివరి ఇల్లు మాది గుర్తుగా గోడ మీద కారం డబ్బా వుంటుంది ఏం — వస్తావా?"

దాంతో ఖంగు తిన్న-పూజారిగా డైరెక్టర్ డి. ఎస్ ప్రకాశరావు నటించిన ఈ సన్నివేశం వి కృష్ణ, ఎస్ నాగరాజు నిర్మించే "పరోపకారి పాపన్న" లోనిది శ్రీ తిరుమల నాగూర్ కంబైన్స్ పతాకంలో కె ఎస్ మస్తాన్ సమర్పించే ఈ వన్నెల చిత్రంలో చంద్రమోహన్, ఈశ్వర్రావు, వంకాయల, కాకరాల, పొలంపల్లి, నాగేంద్రబాబు, కె విజయ, గిరిజారాణి, శ్రీశైలజ ముఖ్య తారాగణం



'దేవుడిచ్చిన కొడుకు'లో కృష్ణ, శ్రీదేవి

# కె. కె. శర్మ

నా పుట్టినరోజు వేడుకన్నా నా అభిమానులే కాదు, నాకు ఒకటో అరో దురభిమానులున్నా – అందరూ ఎంతో ఘనంగా జరుపుకుంటారు ఒకరికొకరు శుభాకాంక్షలు, తీపి తీపి మిఠాయిలు పంచిపెట్టుకుంటారు రంగురంగుల దీపాలతో, తోరణాలతో ఇళ్ళన్నీ అలంకరించుకుంటారు అయ్యా! జోక్ వేస్తున్నాననుకోకండి ఇది నిజ్జ నిజం – నే పుట్టింది దీపావళిపండుగ రోజునే నాలుగు పదుల జీవితాన్ని మతాబాల్లా వెలిగించేసి, ముప్పై ఆరు ఉద్యోగాలు టపాకాయల్లా పేల్చేసి, తుప్పతిప్పలు పడి, ఈ సినీ రంగ బాణాసంచాల బజారులో పడ్డా ఈ కళారంగ రంగవల్లిలో రంగురంగుల దీపాల మధ్య చిచ్చుబుడ్డిలా వెలుగుతూ, అవకాశం వచ్చినప్పుడల్లా తారాజువ్వలా పైకెగరడానికి ప్రయత్నిస్తున్నా 'అందాల రాముడు'లో మన అందాల అక్కినేనిగారన్న "ఎదగడానికెందుకురా తొందర!" అనే పాట నేను పుట్టగానే విని వుంటే, ప్రపంచం తెలియని ప్రాయంలో అమ్మ ఒడిలో గోరుముద్దలు తింటూ అలాగే వుండిపోయేవాడ్ని కంగారుపడ్డానో, తొందరపడ్డానో టపాకాయలాంటి ఈ జీవితంలో పడ్డాను అమావాస్యనాడు తన రంగుల వెలుతురులతో దేదీప్యమానం చేసే దీపావళి – అమావాస్యలాంటి కారుచీకట్లు కమ్ముకున్న



నటుడు కె. కె. శర్మ

మనసులలో సైతం దివ్వెల వెలుగివ్వాలని – నా పుట్టినరోజు పండుగనాడు ప్రార్థన.

## "మనసబుగారి అల్లుడు"లో అడ్డుతిగిలే ఆభరణాలు

శోభనపు గది... మంచంమీద రమేష్ నిద్ర నటిస్తూ ఉన్నాడు. తలుపు దగ్గర బిక్కు బిక్కుమంటూ నిలుచోనున్న సరస్వతి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ, మంచం చుట్టూ ప్రదక్షిణం చేసింది చివరికి రమేష్ పాదాల దగ్గరికి వచ్చి నమస్కరించింది కాలిమట్టెల ధ్వని, గాజుల గలగలలు విన్న రమేష్ మెల్లగా కళ్ళు తెరిచి, ఆమె అందచందాలకు ముగ్ధుడయ్యాడు "నీ స్థానం అక్కడ కాదు – ఇక్కడ," అంటూ ఆమెను దగ్గరికి తీసుకున్నాడు ఆమె మెడలోని నగలు తన ఎదకు గుచ్చుకునేసరికి "అబ్బా!" అంటూ ఆమెను దూరం చేసుకుని, "ఈ నగలన్నీ." అని ఏదో చెప్పబోతూండగా – "నాన్నగారు బస్తీనుంచి తెచ్చినవే," అంది సరస్వతి

"వీటిని మొయ్యాలనే ఉంటే, నీ పేరు సరస్వతికి బదులు–లక్ష్మి అని మార్చుకో ఏం?"

"అలాగేనండి"

"ఏమిటి అలాగే?"

"తీసేస్తానండి"

"గుడ్ గర్ల్!" అంటూ మళ్ళీ ఆమెను అక్కున చేర్చుకునేసరికి మళ్ళీ నగలు గుచ్చుకున్నాయి "కలిసే మన రెండు హృదయాలకూ అడ్డు తగులుతున్నాయ్ ఈ నగలు తీసేయ్," అంటూ రమేష్ (గిరిబాబు) స్వయంగా సరస్వతి (గీత) నగలు తీయసాగాడు

లక్ష్మి విజయ్‌బాబు నిర్మించే విజయ ప్రభా మూవీస్ "మునసబుగారి అల్లుడు" చిత్రానికి కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను ఎన్ డి విజయ్‌బాబు నిర్వహించారు



'వెండి రథం'లో విజయ, లత



'శివమెత్తిన సత్యం'లో
కృష్ణంరాజు, సత్యనారాయణ

## ధూళిపాళ

మా కారులో పెట్రోల్ కాస్త ఎక్కువగా ఉందని తెలిస్తే చాలు — దాన్ని షెడ్‌లో ఉండనివ్వరు మా పిల్లలు. అందుకనే అప్పుడప్పుడు కొద్దికొద్దిగానే పెట్రోల్ పోయిస్తూంటాను అవసరంకొద్దీ.

పోయిన సంవత్సరం దీపావళికి మా బంధువులు వస్తున్నట్లు ఉత్తరం రాస్తే, నేనే స్వయంగా కారును సెంట్రల్ స్టేషన్‌కు తీసుకెళ్ళా. తరచు నేను తాళంచెవులను కారులోనే వదిలేస్తూంటాను పరధ్యానంగా. ఆ రోజు కూడా అలాగే జరిగింది. నేను స్టేషన్ లోపలికెళ్ళి, ఆ బంధువులతో తిరిగి వచ్చి చూద్దును కదా — నా కారు లేదు! ఏ కార్ల దొంగో దాన్ని చల్లగా డ్రయివ్ చేసుకొని చక్కా వెళ్ళిపోయాడు. నాకేం పాలుపోలేదు. వచ్చిన బంధువులు ప్రయాణ బడలికలో ఉన్నారు. లగ్గేజ్ వేరే. ఏం చేయడానికీ తోచక పోలీస్ కంప్లయింట్ అయినా ఇద్దామని, ఆ బంధువులను అక్కడే ఉండమని, నేనొక్కడ్నే బయటకు నడిచా. అంతే! నా కళ్ళను నేనే నమ్మలేకపోయా. ఎదురుగా జనరల్ హాస్పిటల్ పక్కన మా కారు ఒక చోట రోడ్డు మధ్యగా ఆపబడి ఉంది. అక్కడే నా కారు దొరికినందుకు నా గుండె కుదుటపడింది. ఆ దొంగ వెధవ ఎవడోకాని మా కారును చల్లగా డ్రయివ్ చేసుకొని సెంట్రల్ నుంచి వన్ వే ట్రాఫిక్‌లో మెడికల్ కాలేజ్‌దాకా వెళ్ళి, అక్కడ టర్న్ చేసి, రివర్స్ చేసుకొని తుర్రుమనాలనుకున్నట్లుంది. పెట్రోల్ లేక అది ఆగిపోయింది — మొండికేసినట్లు. పాపం, దానితో ఆ దొంగగారు కారును అక్కడే వదిలేసి, బ్రతుకుజీవుడా — అని కాళ్ళకు బుద్ధి చెప్పినట్లున్నాడు. మొత్తంమీద నేను కారులో లిమిటెడ్‌గా పెట్రోల్ పోయించడంవల్ల నా కారు అక్కడే నాకు దక్కింది కదా!

**"అగ్ని సంస్కారం"లో**

**కం జంగారి కార్యసాధన**

"ఎందాకా వచ్చిందిరా మీ సమ్మె?" అని అడిగాడు కరణం (నారాయణ)

"సావలేక బతికేటోళ్ళం. సస్తే సస్తాంగాని, ఆ మారాజులకి దయొచ్చేదాకా సమ్మె సాగేదే ఖాయం," అన్నాడు కోటయ్య (రమణమూర్తి).

"ఆఁ...పట్టాభిరామయ్యగారిచ్చిన ఆ గింజలు, ఆ యమ్మ ఇచ్చిన రూపాయలు ఎన్ని రోజులు వస్తాయిరా? వ్యవహారం అన్న తర్వాత పట్టూ విడుపూ ఉండాలి."

"అది ఆరికీ వుండాలి కదండీ?"

"వాళ్ళకేమిట్రా అవసరం? కడుపు నిండిన బేరం. కాని, మీ సంగతి ఆలోచించుకోండి. ఇలాగే వార్రోజులు సాగిందంటే, మలమలా మాడి చచ్చిపోతారు. అప్పుడు మీరు సమ్మె చేసి ఏం లాభం? సాధించి ఏం లాభం? మీరు మాట్లాడకుండా వెళ్ళి, ముందు నా చేను కోసెయ్యండి. నేనిచ్చేదేమీలేదు. మీ అందరికీ ఒక్క రోజు పని. మావాళ్ళందరితో మీరడిగిన కూలి ఇచ్చానని చెబుతాను. దాంతో సమస్య పరిష్కారమై పోతుంది."

"సరే, బాబా! అట్టాగే కానీయండి."

శ్రీ శారద ఇంటర్నేషనల్ వారి "అగ్ని సంస్కారం"లో చిరంజీవి, లక్ష్మీకాంత్, రమణమూర్తి, ధూళిపాళ, భానుప్రకాష్, రూప, భావన, లక్ష్మిప్రియ, మధురాణి, సత్యవాణి, ఆదోని లక్ష్మి, పింగళి, నారాయణ, శ్రీరాం పాత్రధారులు. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : జి. వి. ప్రభాకర్. మాటలు : శ్రీపతి దత్తాత్రేయశర్మ. గీతాలు : శ్రీశ్రీ., వేటూరి. సంగీతం : ఎం. జనార్దన్. ఛాయ : పాము కూర్పు : సురేంద్రనాథ్. సహనిర్మాత : బి. వి. లక్ష్మయ్య. నిర్మాతలు : పి. రమాదేవి, జి. వసుమతీదేవి.




## సినిమా

### విడుదలకు ముందే రజతోత్సవం!

"దుల్హన్ వహీజో పియామన్ భాయే" హిందీ చిత్రం విడుదలవడానికి ముందే ఔరంగాబాద్‌లో రజతోత్సవం పోస్టర్లు అంటించబడ్డాయి. ఏ కేంద్రంలోనో రజతోత్సవం సందర్భంగా ముద్రించిన పోస్టర్లు పొరబాటున ఔరంగాబాద్‌లోని రాక్సీ థియేటర్‌కు పంపబడడంతో ఈ పొరబాటు జరిగిపోయింది.

### ప్రభు చిత్ర ప్రొడక్షన్స్

"ముఖద్దర్‌కా సికిందర్" హిందీ హిట్ చిత్రం ఆధారంగా ఎం. రాయపరాజు నిర్మించే వన్నెల చిత్రంలో కృష్ణంరాజు హీరో. గతంలో కె. రాఘవేంద్రరావు, ఎస్. డి. లాల్ ప్రభృతుల వద్ద సహకార దర్శకుడుగా పని చేసిన సరిపల్లె చిట్టిబాబు ఈ చిత్రానికి దర్శకుడు.








'దశ తిరిగింది'లో మోహన్‌ప్రసాద్

## గీత

నిరుడు దీపావళికి గుంటూరు నుంచి ఒక అభిమాని నాకు గ్రీటింగ్స్ పంపిస్తూ, "నా అభిమాన —"కు అని రాశారు. ఎందుకని ఆయన అలా 'డాష్' పెట్టారు? అక్కడ ఆయన ఏం రాయాలనుకున్నారు — అని గంటల తరబడి ఆలోచించాను. ఆ తర్వాతగాని నాకు తోచింది కాదు "—" అంటే 'గీత' అని. ఎంత వండర్‌ఫుల్ ఐడియా ఆ అభిమానిది! ఆ గ్రీటింగ్ కార్డు నా దగ్గర ఇప్పటికీ ఉంది.

## నిండు నూరేళ్ళు

సీత (జయసుధ) హాలు తుడుస్తూ వుంది. సుత్తి పట్టుకు లోపలికి అడుగెట్టిన మోహన్ (మోహన్‌బాబు) కొన్ని క్షణాలు ఆమె వంకే చూసి, దగ్గాడు. ఆమె తలతిప్పింది.

"దగ్గటం నాకు అలవాటుకాదు; హాబీ కాదు — దగ్గేటంత అనారోగ్యం నాకు లేదు. మీరు అటు తిరిగుంటే — పేరు తెలీక, మరో దారి లేక దగ్గాను ... మీ పేరు ?"

"సీత ... మీరూ ?"

"రావణుడ్ని మాత్రం కాను. కంగారుపడొద్దు. ఎలా వుంది జోకు ?"

"అయితే మీరేనన్నమాట — నాన్నగారు చెప్పినాయన. -ఎదురింట్లోకి కొత్తగా దిగారు కదూ ?"

"కాదు — వచ్చాను. దిగటానికి అది మంయ్యా గొంయ్యా కాదు — ఇల్లు ... ఆఁ ... చూడండి — మీరు చీపురుకట్టపట్టి, నేను సుత్తి నెత్తిపెట్టి మాట్లాడుకుంటే — పోట్లాటలా అనిపిస్తుంది ... పక్కనే పెట్టేద్దాం."

"కూర్చోండి. నాన్నగారిని పిలుస్తాను."

"నేను కూర్చోను. మీరు పిలవొద్దు. కారణం — టైమయింది. నేను ఆఫీసుకెళ్ళాలి."

"ఎక్కడ పని చేస్తున్నారు మీరు ?"

"ఎక్కడ పని చెయ్యటంలేదని అడగండి. కార్పొరేషన్ ఆఫీసని చెబుతా. ఉద్యోగం అక్కడ కనక, వెళ్తాను. చెయ్యడానికి పనేం వుండదు కనక, పని చెయ్యను."

"ఇంతకీ, మీరిప్పుడు వచ్చింది..."

"నిజం చెప్పనా — అబద్ధం చెప్పనా ? ముందు నిజం చెబుతాను. నచ్చకపోతే అబద్ధం చెబుతాను. దణ్ణం పెట్టుకోడానికి — దేవుడి ఫొటో గోడకి కొట్టుకోవాలి గనక, సుత్తి పట్టుకెళ్ళాను. అది తిరిగి ఇచ్చేటందుకు వచ్చాను."

"నిజం చెప్పారు ... సరే — అబద్ధం చెప్పండి."

"మిమ్మల్ని చూడాలని ...! ఎలా వుంది జోకు ?" అంటూ సీత జవాబుకు ఎదురు చూడకుండానే జారుకున్నాడు మోహన్.

శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "నిండు నూరేళ్ళు" వర్ణ చిత్రాన్ని కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో మిద్దె రామారావు నిర్మిస్తున్నారు

## హిందీలో "మరో చరిత్ర"

"ఏక్ దూజే కేలియే" ... "ఏక్ బార్ ఇతిహాస్" పేరున కె. బాలచందర్ దర్శకత్వంలో రూపొందుతుంది. కమలహాసన్ కథానాయకుడు.

ఆ వూర్ని వదిలి రావడానికి అంగీకరించలేదాయన. "నేను పట్నం రాను బాబూ, నా జీవితం యిక్కడ వెళ్ళిపోవలసిందే నువ్వు వస్తూ పోతూ వుంటావుగా" అన్నప్పుడు "తప్పకుండా నాన్నగారూ! నేను వారానికోసారి వచ్చి వెళతాను. ఈ సంవత్సరం కూడా మన పొలం రామయ్యగారికే కౌలుకివ్వండి మీరు ఎండల్లో పొలం వెళ్ళి ఆరోగ్యం పాడుచేసుకోకండి" అంటూ అప్పగింతలు పెట్టి, అన్నపూర్ణమ్మగారి దగ్గరా మల్లి దగ్గిరా శలవుతీసుకొని విజయవాడ వెళ్ళిపోయాడు

* * *

అప్పటినుంచీ ప్రతివారం, తమ వూరికి, శనివారం సాయంత్రం బయలుదేరిరావడం, సోమవారం ప్రొద్దుటే బస్సెక్కి విజయవాడ చేరటం బాగా అలవాటైంది

ఒక్క విషయంలోమాత్రం వాళ్ళిద్దరికీ రాజీ కుదరడంలేదు. అది, మాధవ్ దుస్తుల ధారణ విషయంలో శ్రద్ధ తీసుకోడని మల్లికి మహాకోపంగా వుండేది.

పదోక్లాసు నాలుగుసార్లు తప్పి యింట్లో కూర్చున్న మున్సబు కొడుకు పరమేశం, చక్కగా బెల్‌బాటమ్స్ వేసుకొని "నెక్‌టై" కట్టుకొని సాయంత్రమయ్యేసరికి పల్లెలో పెద్ద హీరోలా కాలరెగరేస్తూ తిరుగుతుంటే వళ్ళు మండిపోయేది మల్లికి

ఎందుకూ కొరగాని వెధవలందరూ అలా ఫోజులు కొడుతుంటే చక్కటి పర్సనాలిటీ, అందుకు తగ్గ విద్యా, హోదా, అన్నీ వున్న మాధవ్ పల్లెటూరి బైతులా పంచె లాల్చీ వేసుకొని తిరగటం సుతరామూ నచ్చదు మల్లికి కలిసిన ప్రతిసారీ వాళ్ళిద్దరికీ ఆ విషయంలో గొడవ తప్పదు

# సుదూర తీరాలు

[29వ పేజీ తరువాయి]

ఈమధ్య ఆ ప్రసక్తి వస్తే మాటలే మానేస్తున్నాడు మాధవ్ ఇది మరీ బాధగా వుంది తను కనీసం అతనిచేత తన కిష్టమైన ఒక్క పనీ చేయించలేకపోయానని అనుక్షణం అనుకుంటూ బాధపడటం, తిరిగి మాధవ్ రాగానే సర్వం మరచి అతనితో పొలాలవైపో, కృష్ణ వొడ్డుకో చేరుకోడం, తెగని కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేయడం, అలవాటుగా మారిపోయినా, ఓమూల ఏదో వెలితిగా అనిపించేది

తెల్లగా మల్లెపూవుల్లాంటి పంచె లాల్చీ ధరించి మూర్తీభవించిన ఆంధ్రత్వంతో, మాలిన్యంలేని నవ్వుతో ఆపేక్షగా మాట్లాడే మాధవ్ అంటే మల్లికి పంచప్రాణాలు. అయినా మొదటినుంచీ మల్లి తత్వం వేరు ఒక్కసారి కాలేజిలో మాధవ్‌ను పాంటూ, షర్టులో చూసింది ఎంతో అందంగా హుందాగా వున్న ఆ రూపం, ఆ మాటూ, బాటూ చూసి, ఇంక మాధవ్ ఆ ఉద్యోగంలో చేరితే, రోజూ అదే డ్రెస్సు వేసుకుంటాడని కలలుగన్నది ఆ రూపం మనసులో చెరగనిముద్ర వేసుకుంది

పాపం! మల్లి కోరుకున్నట్లు జరగలేదు ఆ ఇంటర్వ్యూకు మాత్రమే తప్పనిసరై తండ్రి చెబితే ఆ డ్రస్‌లో వెళ్ళాడు — మాధవ్ ఆతర్వాత ఉద్యోగంలో చేరిన తర్వాత, మళ్ళీ తనూ తన బ్రాండ్ డ్రెస్సు తయారు ఆ ఆఫీసువాళ్ళే మాధవ్‌కు ఎడ్జస్టు అయిపోయారుకాలేజిలో అతన్ని మార్చలేక పైగా తనను చూసి మరికొందరు కొలీగ్స్ తనలాగే డ్రెస్ వేసుకుంటున్నారని,



'గురు'లో శ్రీదేవి, కమల్‌హాసన్

మాధవ్ చెప్పినప్పుడు వళ్ళు మండిపోయింది మల్లికి

"అవును పాపం! యింతోటి డ్రెస్సూ ఎక్కడా కనిపించక నిన్ను యిమిటేట్ చేస్తున్నారు వాళ్ళు అన్నీ అబద్ధాలే! మాయమాటలు చెప్పి నన్ను మరపించాలని చూడకు" అని కోపంగా వెళ్ళిపోయేది

ఈ డ్రెస్ గొడవ ప్రతి వారం తప్పటంలేదు ఐనా ఆ రోజు ఎలాగైనా మాధవ్‌తో మళ్ళీ వాదించి తన మాట నెగ్గించుకోవాలని మరీ పట్టుదలగా వుంది మల్లికి

అందుకు కారణం లేకపోలేదు. అంతక్రితం రోజు కృష్ణకు నీళ్ళకెళ్ళినప్పుడు ఫుల్ బ్లూ డ్రెస్‌లో బ్రిడ్జి దగ్గిరగా నుంచుని, తదేకంగా రేవు వైపు చూస్తున్న ఓ ఆకారం కళ్ళముందు మెదిలింది చక్కటి శరీరచ్ఛాయకి అందంగా అమరిన ఆ బ్లూ డ్రెస్సూ, కళ్ళకు పెట్టుకున్న డబుల్ కలర్ కూలింగ్ గ్లాసెస్, విలాసంగా సిగరెట్ పొగ మేఘాల్లోకి వదులుతూ మున్సబు కొడుకు పరమేశంతో ఏదో మాట్లాడుతూ రేవు వైపే చూస్తున్న అతనెవరో తెలీదు కానీ, అతన్ని చూడగానే, ఒక్కసారి మాధవ్‌ను అతనితో పోల్చుకోకుండా వుండలేకపోయింది అవన్నీ అలాగే అమరితే మాధవ్ తప్పకుండా ఆ వ్యక్తికంటే అందంగా వుంటాడు కానీ మొద్దు బావ! తన మాట వింటేకదూ! నీళ్ళబిందె చంకనెత్తుకుంటూ ఈసారైనా మాధవ్‌ను ఒప్పించే ప్రయత్నం చేయాలని ఆలోచిస్తూ అతనివైపే చూస్తూ అడుగులు యింటివైపు వేసింది

* * *

ఆ రోజు నాలుగ్గంటలకే షికారు బయలుదేరారు యిద్దరూ జంటగా నడిచిపోతున్న యిద్దర్నీ చూసి చిన్నగా నవ్వుకున్నారు దశరథరామయ్యగారు ప్రక్కయింట్లో పనిలో మునిగివున్న అన్నపూర్ణమ్మగారిని కేకేశారు

"పూర్ణా! అమ్మా పూర్ణా! యిలా రా" అన్న మాష్టారుగారి కేక విని చేతులు తుడుచుకుంటూ వచ్చిన అన్నపూర్ణమ్మ —

"ఏమిటన్నయ్యా" అని వాకిట్లోకి వచ్చింది

దూరంగా కనుమరుగవుతున్న జంటవైపు చూస్తూ, "ఏంలేదమ్మా! ఎలాగూ మాధవ్ ఉద్యోగస్తుడయ్యాడు గృహస్థు కూడా అయితే చూసి ఆనందించాల్సినవాళ్ళం మనమే కదా! అందుకని నేనో నిశ్చయానికొచ్చాను, తొందరలో పెళ్ళి చేయాలని"

అన్నపూర్ణమ్మగారి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి "ఎంత కలివిడిగావున్నా, ఎంత సొంత అన్నాచెల్లెళ్ళలా కొన్ని సంవత్సరాలుగా ప్రక్కప్రక్కనే వుంటున్నా, ఆవిడకు మాధవ్‌కు మల్లిని చేసుకోరేమోనని బెంగ లేకపోలేదు. ఒకరకంగా తను దశరథరామయ్యగారింట్లో వంట మనిషని చెప్పుకోవచ్చు, ఆయన అలా చూడక పోయినా! మొదటినుంచీ అన్యోన్యంగా కలిసి తిరుగుతున్న ఆ జంటను విడదీయడం పాపమే అవుతుంది అయినా స్నేహితుడి భార్యను

ఆంధ్రప్రదేశ్‌లో సంచలనాన్ని
సృష్టించిన రజతోత్సవ చిత్రం
"పొట్టేలు పున్నమ్మ" నిర్మాత
ద్వితీయ కానుక!





దేవర్ ఫిలింస్






# అమ్మ ఎవరికైనా అమ్మ



ఈస్ట్‌మన్ కలర్

కథ-స్క్రీన్‌ప్లే
శాండో ఎమ్ ఎమ్ ఎ చిన్నప్పదేవర్

దర్శకత్వం
ఆర్. త్యాగరాజన్ B.Sc.,



నిర్వహణ
చిత్తూరు ఆనందనాయుడు

నిర్మాత
సి దండాయుధపాణి B.Com

వరల్డ్ నెగిటివ్ రైట్స్ కంట్రోలర్స్: రావుల అంకయ్యగౌడ్, రవీంద్ర ఫిలింస్ గూడూరు

లక్ష్మీ ఫిలింస్

ASSOCIATED

తోబుట్టువులా ఆదరించి, చనిపోయిన స్నేహితుడి ఆత్మ, తన కుటుంబాన్ని తలుచుకొని ఘోషించ కుండా ఆ కుటుంబానికో దారి చూపి, ఆదరించిన మాష్టర్‌గారి మంచితనాన్ని, తమ స్వార్థానికి వుపయోగించుకోడం ఏం న్యాయం ? ఆయన అండదండలూ మంచితనం లేకపోతే తమా, మళ్లీ ఆ ఊళ్లో అంత ప్రశాంతంగా వుండగలిగేవారా ?" ఆలోచనల్లో మునిగిపోయిన అన్నపూర్ణమ్మను చూసి, "ఏమ్మా! మాట్లాడవేం! ఏంటి ఆలోచిస్తున్నావు ?" అంటున్న మాష్టర్‌గారి మాటలు ఈ లోకంలోకి తెచ్చిపడేశాయి.

తాత్కాలికంగా ఆలోచనలకు స్వస్తి చెప్పి, "అన్నయ్యా! నేనూ అదే చెబుదామనుకుంటు

న్నాను పాపం! మాధవ్ హోటల్ భోజనం తినలేక నానా అవస్థ పడుతున్నాడట బస్తీలో. 'నేను తృప్తిగా భోంచేసేది వారానికి ఒక్కసారేనత్తయ్యా!' అంటుంటే నాకెలాగో అనిపించింది ఆ బాధలేకుండా వుండాలంటే మాధవ్‌కు తొందరగా పెళ్లి చేయడం మంచిదే. మీరన్నట్లు ఓ మంచి అమ్మాయిని చూసి తొందరగా మాధవ్‌ను గృహస్థుని చేసేయండి'' అంది చిన్నగా నవ్వడానికి ప్రయత్నిస్తూ

''ఏంటమ్మా! ఏమంటున్నావ్! మంచిపిల్లను చూసి మాధవ్‌కు పెళ్లి చేయనా? ఎంత మాటన్నావమ్మా?

ఇన్నాళ్ళ అనుబంధంలో నువ్వు నన్నర్థం చేసుకుందింతేనన్నమాట ఆ మాటనడానికి నీకు నోరెలా వచ్చిందమ్మా?

మల్లెపూవులాంటి మల్లి వుండగా యింకో పిల్లను చూడవలసిన ఖర్మ నాకేమిటమ్మా? నీ కిష్టంలేదా? లేకపోతే .''

అంటూన్న దశరథరామయ్యగారు మాటలు పూర్తి చేయకముందే కళ్ళనిండా నీళ్ళు నింపుకున్న అన్నపూర్ణమ్మ దశరథరామయ్యగారి కాళ్ళకు వంగి నమస్కరిస్తూ,

''అన్నయ్యా! అంతమాటనకండి మీరు మల్లినే చేసుకుంటామంటే అంతకంటే అదృష్టం యింకేముంటుంది? మాధవ్ బాబును నేను అత్తయ్యలానే కాదు, అమ్మలాగా పెంచాను అందుకే మాధవ్ భవిష్యత్ గొప్పగా వుండాలనుకోడంలో తప్పలేదు. మల్లి మాధవ్‌ల వివాహం చేస్తామని మీరంటే అది అది మీ గొప్పతనానికి నిదర్శనం మల్లి అదృష్టవంతురాలు తండ్రి లేనిది, దురదృష్టవంతురాలు అనుకుంటుండేదాన్ని అదృష్టం మాధవ్ రూపంలో దాన్ని వరించింది మీ యిష్టప్రకారమే కానివ్వండన్నయ్యా!'' అంటున్న అన్నపూర్ణమ్మను పైకి లేపారు

సంతోషంలో ఆమెకు మాటలు తడబడుతున్నాయి చిన్నగా నవ్వుతూ దశరథరామయ్యగారు,

''కళ్ళు తుడుచుకోమ్మా! వెళ్ళి యీ పూట మాధవ్ కిష్టమైన స్వీటేదైనా చేయి వాడి పేరు చెప్పకొని నేనూ తింటాను'' అన్నారు

''అలాగే అన్నయ్యా!'' అంటూ కళ్ళు తుడుచుకుంటూ లోపలికెళ్ళింది అన్నపూర్ణమ్మ, సంతోషం నిండుకొచ్చిన గొంతుతో

ఆలోచిస్తూ పడకకుర్చీలో వాలారు మాష్టారు మల్లి మాధవ్‌ల జంట చూడ ముచ్చటగా వుంటుంది మున్సబు తన కూతుర్ని మాధవ్ కిస్తానని కబురుపెట్టిన తర్వాతగానీ మాధవ్‌కు పెళ్ళి చేయాలనే విషయమే స్ఫురించలేదు యాభైవేలు కట్నమిస్తానని కబురు చేశాడు మున్సబు

వోట్లు కొన్నట్లే మనుషుల్నీ కొనొచ్చని అతని వుద్దేశ్యం ''మున్సబుతో విరోధం మంచిది కాదు పైగా యాభైవేలు కట్నమిస్తామంటున్నారు ఒప్పకోండి మాష్టారూ! మరోళ్ళు మట్టుకు అంతకంటే ఎక్కువిత్తారేంటి?'' అంటూ చెబుతున్న పెద్దకాపు మాటలు చెవుల్లో మార్మోగాయి.

## ''దుబ్బా - దుబ్బా దీపావిల్లీ''

మల్లీ వస్తున్నావా దీపావళీ
మాచేత మతాబా కాల్పించడానికి,
మా కంట ముత్యాలు రాల్పించడానికి!?
మమ్మల్నింక మభ్యపెట్టి లాభంలేదు — మల్లిపో,
వెల్తురు లేని వేడితో వేధించక వెళ్లిపో —

విన్ను ఎగిరించే ఇంధనం, ధనం,
మిన్ను దిగిరాదు నీ తేజోస్యంధనం!
మా కొలతలన్నీ పోలవెల్తి
మా సరుకులన్నీ శుద్ధ కల్తీ!
మా పదుముకున్న మందుగుండ ఎండదు,
మా ఎదలనున్న 'బాణసంచా' మండదు,
కనుక, ఇప్పుడప్పుడే ఓ ధనిక దీపావళి!
వెలిగించలేవు నీవు మా దళిత గేహాలి —

మా నేత్రాలు ప్రమిదలై ప్రాలినప్పుడు,
మా గాత్రాలు సమిధలై కాలినప్పుడు,
మా నెత్తురు ఆజ్యమై ప్రజ్వరించినప్పుడు,
మా భూమికెలు భాస్వరమై ప్రకాశించినప్పుడు,
మా కపాలాలు మణిశిలలై ప్రేలినప్పుడు,
మా కంకాళాలు అణుశిలలై రాలినప్పుడు,
మాకు చిమ్మ చీకట్లను చీల్చగలిగే కొమ్ములున్నప్పుడు,
మమ్మ మేమే నిలువునా వెలిగించుకొనే దమ్ములున్నప్పుడు,
''దుబ్బా — దుబ్బా దీపావిల్లీ!'' అప్పుడూ, నువ్వు మాకు కావాలి!
మబ్బుల్లోకి మెఱుపులా మా మధ్యకు నువ్వు రావాలి!!

— ''సస్యశ్రీ''

పిల్లనిస్తానని స్వయంగా ఆ బడిపంతులింటికి వెళ్ళడం నామోషీగా అనిపించింది ఆ వూరి మున్సబుకు కానీ ఆలస్యం చేస్తే అందమైన మాధవ్, ఆ వూరి మొత్తంలోకి ఎక్కువ చదువుకున్న అల్లుడు, చెయ్యిజారిపోతాడేమోనని బెంగ అందుకే దారిలో ఎదురైనప్పుడల్లా నవ్వుతో పలకరించేవాడు సన్నగా మీసాలు దువ్వుకుంటూ మాధవ్‌ను

''ఏం అల్లుడూ కులాసా? ఎప్పుడు రావడం? సాయంత్రం అలా యింటివైపు రారాదూ — శ్యామల కీమధ్య సంగీతం నేర్పిస్తున్నాను దాని పాట వోసారి, వినరా వచ్చి'' అంటూ ఆహ్వానించేవాడు

రెండు మూడుసార్లు ఎలాగో తప్పించుకున్నా, ఓ రోజు మున్సబు వెంట వాళ్ళింటికి వెళ్ళక తప్పలేదు మాధవ్‌కు ముళ్ళమీద కూర్చున్నట్లే, కూర్చొని, అప్పుడప్పుడే నేర్చుకుంటున్న జతులు ఎరిగ్గా పలక్క, వీణ కర్ణ కఠోరంగా టంగ్, టంగ్ మనిపిస్తుంటే శ్యామలను బాధపెట్టలేక విని, మున్సబు మావగారు స్పెషల్‌గా చేయించి ఒక్కటి కాఫీ మాత్రం తృప్తిగా త్రాగి,

''వస్తాను మావయ్యా! వస్తానత్తయ్యా! వస్తాను శ్యామా! బాగా ప్రాక్టీస్ చెయ్యి. మరో నెల పోతే, నువ్వే బాగా వాయిస్తావు.'' అంటూ అందరికీ పేరు పేరునా చెప్పి బయటపడి, ఆలస్యంగా కృష్ణవొడ్డుకు చేరుకొని, మల్లిచేత చివాట్లు తిని, తనూ ఏదో వంకతో చివాట్లేసి, మల్లి ఏడుస్తుంటే మల్లీ జాలేసి వోదార్చాడు మాధవ్

అలా చిలిపికయ్యాలు, తియ్యటి అనుభూతులూ, కృష్ణవొడ్డుకే పరిమితం ఇంటికొస్తే బుద్ధిమంతుల్లా మసులుకునేవారు మంచి స్నేహితుల్లా మాట్లాడుకునేవాళ్ళు మాధవ్ చెప్పే కబుర్లు వింటూ, రెప్ప వాల్చకుండా అతని మొఖంలోకి చూస్తూ, తెల్లటి వెన్నెట్లో అరుగుల మీద ఎంతోసేపు కూర్చొని తప్పనిసరిగా రాత్రి పది గంటలకు తల్లితోపాటు లోపలికెళ్ళిపోయేది మల్లి

[ఇంకా వుంది]

"నేను చూసేందుకేగాని పెళ్ళి చేసుకునేందుకు పనికిరాననుకున్నావా ?"

"అదేం మాట సునీ, నాకంత అదృష్టం కలిగేదా ?"

గభాలున లేచి అతని కెదురుగా వచ్చి కూర్చుంది సునంద. "నా కళ్ళల్లోకి చూడు బావా... నీ కళ్ళకే కనక చదివే శక్తి ఉంటే నా కళ్ళల్లో ఏం కనబడుతోందో. నీ మనసుకి చూసే శక్తి ఉంటే చూడు బావా.. నా గుండెల్లో ఏ రూపంఉందో ను... నువ్వు. నీ రూపం" వెక్కి వెక్కి ఏడ్చేసింది.

భాస్కరానికి ఏంచేయాలో తోచలేదు. "సునీ, ఏమిటిది పిచ్చిపిల్లలా ! అయిపోయిం దానిగురించి అంత అప్‌సెట్ అవుతావేం. అతనికేం... రావు... ఎంత మంచివాడు ?"

"చాలా మంచివారు. కాదనను. నేనాయన కళ్ళకి చిన్న పిల్లని. బంగారపు బొమ్మని. 'రావుగారి భార్య ఎంతందమయిందో!' అని పించుకోవడం కావాలి ఆయనకు. అటువంటి మెచ్చుకోలు వస్తుందనుకున్నప్పుడే నన్ను వెంట తీసికెడతారు ఆయన దగ్గరున్న షో కేసులో అతి అందమయిన ఖరీదయిన బొమ్మని నేను !

కాని ఆ బొమ్మ మనస్సెక్కడుందో ఎవ్వరికీ అక్కరలేదు" అని కాసేపాగి "ఎందుకడగలేదు బావా మా డాడీని అడుగుతే నేనాయన్ని ఒప్పించేదాన్ని కద !" అంది.

"ఎలా అడగమంటావు సునీ, మీ నాన్న అంతస్తు ముందు నేనెంతవాడిని! ఆయన నీడన, ఆయన సాయంతో చదువుకున్నవాడిని. నాకంత సాహసం ఎలా వస్తుంది. అయినా ఆగర్భశ్రీమంతురాలివి నిన్ను చేసుకుని ఏం సుఖపెట్టగలను ?"

"నో, నో బావా — ఈ అర్థంలేని ప్రశ్నలతో నా జీవితాన్ని పాడుచేశావు. నీ పేరు చెప్పి గంగలో దూకమంటే దూకి వుండేదాన్ని నేను. నువ్వంటే అప్పటికీ, ఇప్పటికీ ఎంత ఇష్టమో నీకు తెలియదు "

"అలా అనకు. తెలుసు."

"తెలిసి ఏమిటి నువ్వు చేసింది ?"

"నీకిప్పుడున్న ఈ అంతస్తు, ఈ హోదా నేనివ్వగలనా సునందా! విమానాల్లో తిరుగుతున్నావు...నీకు తెలియదు సునందా, నాకు కావలసినది నీ సుఖం."

"సుఖం. నీ దృష్టిలో ఇదంతా సుఖం అవునా బావా! చాలా సుఖపెట్టావు నన్ను

# నిజం

[ 26వ పేజీ తరువాయి ]

వదిలించుకుని! ... పోనీ ఒక్కమాట అడుగుతాను నిజం చెబుతావా బావా ?"

"నిజం తప్ప అబద్ధం అన్నది లేదు నాలో. అడుగు."

"నేనంటే నీకు ప్రేమ వుందా ?"

"నన్ను ఆ ప్రశ్న అడుగుతావా! ఒక్కముక్కలో 'నా సర్వస్వం' నువ్వే అని చెబుతే చాలా ?"

"మరి ఈ మాట నాతో యెన్నడూ చెప్పలేదేం బావా ?"

"మనిషి 'లౌక్యం' పేరుతో అబద్ధాలు ఆడవలసివస్తుంది నిన్నటిదాకా నా జీవితమూ అంతే! అందుకని మనసువిప్పి చెప్పలేకపోయాను. ఇప్పుడు నిజం తప్ప మరొకటి మాట్లాడటంలేదు "

"ఇప్పటికీ నీ మనసులో నాకు స్థానం వుందా బావా ?"

"ఉంది. మనసునిండా నువ్వే!"

"థాంక్స్ బావా" అని కాసేపు తటపటాయించింది సునంద. చివరికి "మరి మీ ఆవిడంటే ఇష్టమేనా నీకు ?" అనడిగింది సూటిగా అతని కళ్ళల్లోకి చూస్తూ.

"నాకు..."

అతని మాట పూర్తికాకుండానే వంటింట్లో పళ్ళెం ఒకటి పెద్ద చప్పుడు చేస్తూ పడిపోయింది

"పిల్లిలాగుంది" అని పరుగెత్తింది సునంద లోపలికి.

వెలవెల బోతున్న ముఖంతో నిలబడి వున్న శ్యామలని చూసి "మీరెప్పుడొచ్చారు" అనడిగింది.

"ఇప్పుడేనండి. నేను ఎదురువస్తుంటే బయటకుపోయే దారిలేక నా మీదికే దూకింది పిల్లి. నేను ఆ ఖంగారులో ఆ పళ్ళెం మీద పడిపోయాను."

"ఓహ్, ఇందాకొకసారి చప్పుడయింది. అప్పుడు వచ్చివుండాలి పిల్లి లోపలికి. పేరంటం అప్పుడే అయిపోయిందా ?"

"లేదు. ప్రెజెంటేషన్ మర్చిపోయి వెళ్ళాను. తిరిగి వచ్చేశాను. ఇక వెళ్ళనులెండి. రేపివ్వచ్చు వంట కావాలికద ముందు. అన్నయ్యగారు వచ్చేస్తారో ఏమిటో" అంది శ్యామల ఖంగారుగా.

"రావుగారా, వారు పావు తక్కువ పదికి కారు హారన్ మోగిస్తారు. అప్పుడు నేను వెళ్ళి కారెక్కాలి. కనుక నాకు మాత్రం వండండి. మీ ఇంట్లో తృప్తిగా భోజనం కూడా చేసి వెడతాను" అని నవ్వుతూ "అవునూ రావుగారు మీకు అన్నయ్య వరసెలా అవుతారు? పోనీలెండి ఏదో ఒకటి" అంది సునంద

ఇదంతా చూస్తూ నిలబడ్డ భాస్కరం శ్యామల వంక ఒకసారి చూసి మాట్లాడకుండా ముందు గదిలోకి వెళ్ళిపోయాడు

సరిగ్గా పావుతక్కువ పదికి హారన్ మోగింది. సునంద కారులో కూర్చుంటూ "నే చెప్పలేదూ మీ అన్నగారి సంగతి ? ... వస్తా బావా! థాంక్స్ — మీ ఆతిథ్యానికి" అంది.

రావుగారు "డాలీ, మీల్స్ తీసుకున్నావా?" అనడిగారు.

"లేకపోతే వీళ్ళు ఒదులుతారా నన్ను" అంది సునంద నవ్వుతూ

"థాంక్సండి మా డాలీ ఆనందమే నాదీను."

కారు వెళ్ళినవైపు చూస్తూ నిలబడిన శ్యామలని "పేరంటానికి వెళ్ళి వెంటనే తిరిగి వచ్చేశావు కదూ" అడిగాడు భాస్కరం.

శ్యామల మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

పడుకోబోయేముందు "కొత్త సంవత్సరం మొదటిరోజున నాదొక కోరిక వుంది. తీరుస్తారా?" అనడిగింది శ్యామల

"తప్పకుండా."

"'నిజం' మాట్లాడే ఈ వ్రతాన్ని మానేసి మామూలుగా వుండండి అదే పదివేలు నాకు" అంది.

భాస్కరం ఆమెవంక చూసి నవ్వి దుప్పటి మీదికి లాక్కున్నాడు.

తెల్లవారుఝామున మెలకువ వచ్చిన శ్యామల భాస్కరాన్ని తట్టిలేపి "నిన్న సునందతో మీరన్న మాటలన్నీ నిజమేనా?" అనడిగింది.

"పిచ్చిపిల్ల నిజమని నమ్మింది ఆమె మనసు తృప్తికోసం అలా చెప్పాను" అన్నాడు భాస్కరం.

అతని దుప్పటిలో ఆమెకు చోటిచ్చాడు జరిగి వెచ్చగా పడుకుంది శ్యామల ●

# ప్రేమ పాశం

(18 వ పేజీ తరువాయి)

మాటలు? లేకపోతే ఈ ఖర్చు యెక్కువని పిస్తుందా?' కోపంగా అంది కమలమ్మ.

"యెక్కువో తక్కువో నాకు తెలియదు కాని ఇక మీదట నేనివ్వలేనిది."

"సంపాదించేదంతా వాళ్ళ చేతుల్లో పొయ్యమన్నారా?"

"లేదు అవసరమైన వాటికే ఖర్చు పెట్టాలనుకుంటున్నాను."

'యెంత మారిపోయావే!"

"ఈ మార్పు లేకపోతే నా ముందు జీవితం నిక్కష్టంగా వుంటుందమ్మా." నిర్జీవంగా నవ్వింది.

"అమ్మట అమ్మ ఆ ప్రేమ నీకుంటే ఇలా మాట్లాడతావా?"

"ఆ బంధం తెంపుకున్నా తెగనిది కాబట్టే మళ్ళీ ఇక్కడికి రాగలిగాను బాధ్యతలను కాదనలేక పోతున్నాను. కాకపోతే మీరడిగినంత డబ్బు నే నివ్వలేనని చెప్తున్నాను. అలా చెప్పడం తప్పుకాదు"

మాధవికి పెండ్లి సంబంధం చూసేందుకు మద్రాసు వెళుతున్నామంటే తనివ్వదలుచుకున్న అయిదొందలు కాక మరో రెండొందలు యెక్కువగా ఇచ్చింది

ఆ పూట అక్కడే వుండమని తల్లి చెప్పినా వుండాలనిపించక కాఫీ మాత్రం తాగి వచ్చేసింది.

శాంతి. మనోహర్ హాస్పిటల్‌కు బయలుదేరుతుండగా పోస్ట్ వచ్చింది

మూర్తి, చంద్రంలకు ఇంటర్వ్యూ కార్డ్స్ వచ్చాయి.

అవి తీసుకొని భర్త చేతికిచ్చింది శాంతి.

మనోహర్ వాటిని చూసి తమ్ముళ్లను పిలిచి ఇచ్చాడు.

"ఛట్, ప్రవేటు కంపెనీలో గుమాస్తా వుద్యోగం! నెత్తి!" కార్డ్ చింపి రించి కొట్టాడు మూర్తి.

"కాలేజిలో క్లర్కు పోస్టు! పనికిమాలిన వుద్యోగం!" వీలైనంత అసహ్యం ప్రకటించాడు చంద్రం.

యింప్లాయిమెంట్ యిక్స్చేంజ్ వాళ్ళను కాసేపు తిట్టుకున్నారు.

"పువ్వు వుద్యోగాలకు వాళ్ళు పిలిచారు. నాకేదీ లేదీ మీ [illegible] యోగ్యత

బాధ పడతారు?" అన్నాడు మనోహర్.

గ్రాడ్యుయేట్స్ అయ్యా, ఇన్నాళ్ళు నిరుద్యోగులుగా యెందు కున్నారో అప్పుడవగతం అయింది శాంతికి.

నేలమీద పడ్డ మూర్తి ఇంటర్వ్యూ కార్డ్ను చేతిలోకి తీసుకొని, అతడి వైపు కార్డ్ వైపు చూసి "ఇంటర్వ్యూ చెయ్యడానికి భయపడుతున్నారా?" అంది శాంతి.

"యేం, నేమంత చేతవల్లా కనిపిస్తున్నామా?" రోషంగా చూశాడు.

"కాదు. అమాయకుల్లా" తేలిగ్గా నవ్వింది.

"కాకపోతే నాలుగొందలు వచ్చే వుద్యోగం చెత్తదిగా కనిపిస్తుందా?"

"అన్నయ్య వారం రోజుల్లో డిస్పెన్సరీలో సంపాదిస్తాడంత." చురుగ్గా అన్నాడు చంద్రం.

శాంతి క్షణకాలం మాట్లాడలేకపోయింది.

"మీరు చిన్నపిల్లలు కారు లోకంతో యని వాళ్ళు కారు. అతడి చదువు వేరు వృత్తి వేరు. అందరొకే విధంగా జీవించలేరు..."

"అయితే మా జీవితాలు యెదుగు బొదుగూ లేకుండా వుండాలంటారు. అంతేనా?" శాంతిని 'మీరు' మన్నిస్తారు మరుదుల, ఆడబిడ్డలు.

"లేదు. యోగ్యతవున్న వాళ్ళెప్పటికైనా పైకి వస్తారని నా నమ్మకం కావాలను కున్నది దొరుకుతుందో, దొరకదో! వచ్చిన అవకాశాన్ని, ఆ కలలుగనే జీవితం కోసం పోగొట్టుకోడం అవివేకం. మీరు ఇంటర్వ్యూకెళ్ళండి. అందులో నెగ్గితే అదృష్టవంతులు కోవాలి ప్రస్తుతం నవ్వు పరిస్థితిలో."

మనోహర్ వింతగా చూశాడామె వైపు.

"నేను వెళ్ళదలుచుకోలేదు." విసురుగా సమాధానం చెప్పాడు చంద్రం

'యేం, యెందుకు వెళ్ళరు? మీరు ఏ.

---

వనితలకు మనవి

కొత్తరకం వంటలు

క్లుప్తంగా వ్రాసి పంపితే

త్వరగా పరిశీలించ వీలు —సం.



డిగ్రీకో డాక్టరుగా ప్రాక్టీసు పెట్టాలను కుంటున్నారా?" ఆమె వ్యంగ్యత అతణి ఆగ్రహ పరిచింది

"తెలివిగా మాట్లాడుతున్నాననుకోకండి. మా విషయంలో మీ జోక్యం అనవసరం."

"దీనికింత పెద్ద రాద్ధాంతం యెందుకు? మీకెలా తోస్తే అలా చెయ్యండి." అని "పద శాంతీ ఆలస్యమౌతున్నది." అని తొందర చేశాడు మనోహర్. ఇక అక్కడ వుంటే వాగ్వివాదాలు పెరుగుతాయని అతడి భయం

'మీ విషయం నాకనవసరమనుకుంటే మీరిక్కడుండే వాళ్ళు కాదు. మీరు వివేకం గలవారైతే తప్పకుండా ఇంటర్వ్యూకి వెళతారు." అంటూ బైటికి నడిచింది. అప్పటికే మనోహర్ ఇల్లు దాటి పదడుగులు నడిచాడు.

"ఇది తనంత తాను వాడికి మళ్ళీ పెండ్లి జరిపించినంతంటేనే నాకేదో అనుమానం కలిగింది అది. ఇది కూడా బలికొన్ని మనల్ని విడిపించాలని కంకణం కట్టుకొని ఈ పని చేశారని గ్రహించలేక పోయాము.." తులశమ్మ గొంతు తారా స్థాయిలో వుంది.

"ఇప్పుడా పిల్ల చెప్పినదాంట్లో తప్పేముందని అంతగా అరుస్తున్నావు? ఉద్యోగాలు దొరకడమే కష్టమైన ఈ రోజుల్లో వీళ్ళు ఉద్యోగాలు నచ్చలేదంటూ, ఇప్పటికే నాలుగు సార్లు ఇంటర్వ్యూలకు కాని, పరీక్షకు కాని వెళ్ళలేదు. వాడితో సమానంగా వుద్యోగం వచ్చేదెప్పుడు? వీళ్ళ చేసేదెప్పుడు? అదృష్టం బాగుండి తెలివితేటలుంటే నేరిన సంస్థల్లోనే పైకి పోవచ్చుగా." విసుక్కున్నాడు శివయ్య.

"వున్నది లేనిది వాడికి పెట్టి ఇంత వాడ్ని చేసినందుకు బాగా బుద్ధి చెప్తున్నాడు. అది అంతంత మాటలన్నా, విమ్మకు నీరెత్తినట్లు వూరుకున్నాడు. తండ్రైన మీరే గాని మాటలు సమర్థిస్తుంటే ఇక ఈ పిల్లల గతేమౌతుంది?" యేడ్చింది.

"బాగు పడతారులే ఇక వూరుకో." మండిపడ్డాడు శివయ్య

"మంచంలో పడగానే కట్టుకున్న వాడికీ చులకనయ్యాను. ఇదంతా ఆ నాద నష్టపుది చేసింది. లేకపోతే పండులా వుండేది సంసారం..." తులశమ్మ గొంతు మార్మోగుతున్నదా ఇంట్లో. ఆమె లేవగలిగే వుంటే ఆ సమయంలో జానకిని గొంతు పిసికి పారేసి వుండేదేమో!

కామాక్షమ్మ కెదురుగా కూర్చొని కూరలు తరుగుతున్న జానకి కండ్ల నుండి జలజల కారుతున్నాయి కన్నీళ్ళు.

జాలిగా చూసింది కామాక్షమ్మ ఆమెను ఓదార్చాలని వుంది కాని, ఆమె మరింత బాధ పడుతుందేమోనని, యేమీ మాట్లాడ లేక పోయింది. (ఇంకా వుంది)




# వారఫలం

**26-10-1979 శుక్రవారం మొదలు**
**1-11-1979 గురువారం వరకు**

**మేషం:-** ఈ వారంలో మీ ఆదాయం వృద్ధి చెందుతుంది. ధర్మాధర్మ విచక్షణతో కార్యాలోచనలు చేస్తారు. బంధు, మిత్రవర్గము వారితో సంభాషణలు జరుపగలరు. అవి లాభదాయకముగా ఉంటాయి. అన్ని విధాలా వ్యాపారంలో అభివృద్ధి, ఉద్యోగాభివృద్ధి ఉంటుంది. స్త్రీలకు : అన్ని రంగాలలో అభివృద్ధి సూచక వారం.

**వృషభం:-** మీకు శుభవార్త అందుతుంది. లండును గూర్చి కార్యాలోచనలుంటాయి. ద్రవ్యం సమయానికి సమకూడుతుంది. స్వవిషయంలో గావించె ప్రయత్నాలు ఫలదాయకమవుతాయి. ఆర్థికంగా ఏలాటి ఇబ్బందులులేనివారం. వారఫలం సుఖదాయకం. స్త్రీలకు : ఉత్తమవారం. వృత్తి ఉద్యోగంలో విజయం సమకూరుతుంది.

**మిథునం:-** వారారంభమే ప్రోత్సాహకరం. ద్రవ్య లబ్ధికలదు. కార్యక్రమాలు విశ్రాంతి రహితంగా ఒకదాని వెంట ఒకటి సమకూరుట గమనించగలరు. ఆర్థికంగా బాగుండుటేగాక, అనుకున్నంత ఆదాయముంటుంది. వ్యాపారం అభివృద్ధినొందే లక్షణం. రాజకీయ వాదులకు నూతనావకాశాలుంటాయి. స్త్రీలకు : చాలమందికి రాజకీయ రంగానుభవం కలదు.

**కర్కాటకం:-** ఆరోగ్యలోపములేదు. ఆర్థిక లోపమురాదు. ఆదాయంలో అభివృద్ధి ఉంటుంది. సంఘ సేవలో పేరు పొందుతారు. ఇతరులకై పాటుపడుతారు. వృత్తిలో అభివృద్ధి, కార్యసిద్ధి కలదు. స్త్రీలకు : రాజకీయంగా ప్రగతి, వినోద కార్యాలలో ఐక్యం కల్గవచ్చు.

**సింహం:-** పరులతో గల సంబంధ బాంధవ్యాలు వృద్ధి నొందగలవు. వ్యాపారస్థులకు మంచి అవకాశాలుంటాయి. ఎంతెరిసి నేర్పగిన పని. వృత్తిలో అభివృద్ధి, ఫలసిద్ధి, కార్యానుకూలత గల వారం. వారఫలం ఒక్క ఆరోగ్య విషయంలో గాక, తక్కిన రంగాలలో చాల బాగుంటుంది. స్త్రీలకు: లలిత కళా రంగంలో నూతనావకాశాలుంటాయి.

**కన్య:-** మీ శక్తి సామర్థ్యాలకు ఈ వారం పరీక్షా సమయం. పనులలో, గృహ విషయాలలో శ్రద్ధాసక్తులు చూపదగినవారం. వృత్తి విషయంలో ఉత్సాహజనకమైన కాలం. స్త్రీలకు: గృహ కార్యభారం అధికం. బంధుప్రీతికై కొన్ని పనులు చేయవలసి వస్తుంది. గృహోపకరణాలు కలవు.

**తుల:-** వ్యాపారాభివృద్ధికి, వృత్తిలో ప్రోత్సాహానికి, వ్యవసాయ విస్తరణకు మీకు ఈ వారం అభివృద్ధి దాయకం. ఉద్యోగంలో సర్వవిధములా అనుకూలకాలం. ఆర్థికలాభం, విలాస వస్తు సేకరణ, నూతన వస్త్రాలంకారావకాశంగలవారం. వ్యయం కూడా అధికమే. స్త్రీలకు: ఈ వారంలో అన్ని విధాలా అనుకూల దాయకం.

**వృశ్చికం:-** మీరు చిరకాలంగా గావించె కృషి, ఫలించెవారం. దశమంలో గల గ్రహస్థితి, వ్యాపార, వృత్తులలో అభివృద్ధిదాయకం. చాలమందికి రాజకీయంగా అనుకూల ఫలములు ప్రసాదింపగలవారం. దూరదేశ ప్రయాణాలు గావింపవలసి వస్తుంది. ఉన్నత విద్యాభ్యాసంచేసే వారికీ, క్రీడారంగంలో పేరు సంపాదించేవారం. స్త్రీలకు: అభివృద్ధి, కార్యసిద్ధి, ఆర్థికలాభం చెప్పవచ్చు.

**ధనుస్సు:-** వార ద్వితీయ భాగంలో, ఆదాయాభివృద్ధి కలిగిస్తుంది. గృహ సంబంధంగా మనశ్శాంతి, ఆనందం కల్గుతుంది. అందమైన వస్తు సేకరణకు ప్రయత్నిస్తారు. పనులు చురుకుగా సాగుతాయి. ఋణబాధ కూడా చాలవరకు తగ్గుతుంది. ఆరోగ్యభాగ్యం సమకూరుతుంది. స్త్రీలకు : ఆనందం, శాంతి, గృహ సౌఖ్యం, లాభం గలవారం.

**మకరం:-** మీకు గత కొన్ని రోజులుగా ప్రాప్తించె అవరోధాలు క్రమంగా తగ్గుముఖం పడుతాయి. రాశికి అష్టమంలోగల గ్రహబాధ ఇంకా నివృత్తి కాలేదు. నూతనావకాశాలకు అంత అనుకూలంగాదు వారం. సైక్యూలేషన్ ఫలించదు. స్త్రీలకు : మీరు గావించె కృషి, శ్రద్ధ ఫలప్రదం కావటం గమనింపగలరు.

**కుంభం:-** వారవాతావరణం అనుకూలం. ఏదో కొంత అనారోగ్య సూచన ఉండవచ్చు. అందువల్ల బాధలేదు. ఆర్థికలాభం చెప్పవచ్చు. సన్నిహిత బంధువులు, మిత్రులు చేరుతారు. మిత్ర సందర్శనగలదు. వార ద్వితీయభాగం అనుకూలం. పరుల సహాయ సంపత్తులుంటాయి. స్త్రీలకు: కళా రంగంలో, వృత్తిలో ఆదాయం గలదు.

**మీనం:-** వార మధ్యకాలం సర్వానుకూల ప్రదం. ఆశించిన లాభప్రాప్తి. అనుకూలంగా, మీకన్నా పెద్దవారిమొక్క ఆలోచనలుంటాయి. వాని కనుగుణంగా ప్రవర్తించి లాభం పొందుతారు. రాజకీయంగా శ్రమకల్గుతుంది. సాంఘిక సేవ లాభదాయకం. స్త్రీలకు: వృత్తిలో, ఉద్యోగంలో, చాలమందికి రచనావ్యాసంగంలో నూతనావకాశాలుంటాయి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## "దీపావళి"

జీవితాన వెలుగుల రవళి
తేవాలి ఈ దీపావళి
మనసుల్లోన అనురాగసరళి
పెంచాలి ఈ దీపావళి
హృదిలోన ఆనందమురళి
మ్రోగించాలి ఈ దీపావళి
ఈ వెలుగు జిలుగులన్నీ
మళ్ళీ మళ్ళీ రావాలి
కాంతులెన్నో వెల్లివిరియాలి.

— యస్. విద్య



# మిరమిట్లు గొల్పే తెలుపు
# చూడగానే
# అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక

## డెట్

డిటర్జెంట్

బిళ్ల వుతుకే




Shilpi DM 35A/79 Tel




ఏమండోయ్ శ్రీవారూ ఇవాళ కూడా సెలవనుకున్నారా?... ఏడయింది... ఇంకా నిన్నటి మధుర స్మృతులతో మీరు బజ్జుంటే అక్కడ ఈపాటికి ఓపిడిలో అరమైలు క్యూలో ఆఖర్న నిలబడ్డ అరటిక్కెట్టు సోదరుడు ఆరాటంతో ఆంజనేయ దండకం చదువుతూ మిమ్మల్ని ఆడిపోసుకుంటూ వుంటాడు... ఆహాఁ... ఏమి యుక్తి ఏమి ప్రాస..." అని తను అనుకోకుండా వేసిన అకార శబ్దాలకు ఆనంద పడిపోతూ మంచంమీద ముసుగుతన్ని గాఢ నిద్రలో వున్న సుబ్బారావు అనబడే డాక్టరుగారిని మేలుకొలుపుతోంది డాక్టేశ్వరి! ఆవిడ పేరనుకునేరు.... హృదయేశ్వరి, ప్రాణేశ్వరి, లాగే డాక్టరుగారికి ఉత్సాహం ఎక్కువ మోతాదులో వున్నప్పుడు అర్థాంగిని పిలిచే ముద్దు పేరది....

'అబ్బబ్బ.. ఏమిటోయ్ నస... పడుకోనీ...' మళ్లీ ముసుగు బిగిస్తుకున్నాడు సుబ్బారావు.

'అవునవును... నాది నసే... పడుకోండి ఇంకోగంట.. ఇప్పటికే ఏడు గంటలైంది మీకేం' జడ విసురుగా వెనక్కి వేసి విసవిసా గంటల బండిలా వెళ్ళిపోయింది వంటగదిలోకి కాత్యాయని.

'కథ అడ్డం తిరిగిందే.. మరికాస్సేపు బతికా..' అనుకుంటూ చేతిగడియారం చూసుకున్న సుబ్బారావు.

'అమ్మో.. ఏడే...' అంటూ ఒక్క లాంగ్‌జంప్ డైరెక్టుగా గుమ్మంలోకి కొట్టి, అక్కణ్నుంచి బాత్‌రూంలోకి రన్నింగ్ రేస్ చేసి, పరపరా పళ్ళుతోమి... బరబరా ఒళ్ళు తోమి... చకచకా వంటింట్లోకి వచ్చి కొరకొరా.. భార్యను చూస్తూ...

'మరి ఏడుకా లేపేది.. కాస్త వేగం లేపకూడదూ ?...' అన్నాడు

'అనండనండి ..అయిదునుంచీ లేపుతూ వుంటే యిప్పటికి తెలివొచ్చింది తమరికి' అంది వెటకారంగా.

టిఫిన్ ప్లేటు ఆమె చేతిలోంచి అందుకుని డైనింగ్ టేబుల్ పైనుంచి త్వర త్వరగా గొంతుకలో కూరుకుంటున్నాడు. ఇంతలో వెనక నుంచి అయిదేళ్ళ భాస్కరం ముద్దు ముద్దుగా

"డాడీ.. డాడీ.. నా హో..."

'పోరా వెధవా... టైమైపోయి నే ఛస్తూ వుంటే...'

"మమ్మీ... మమ్మీ.. స్కూలుకి టైమవుతోంది... నా కాపీ రాసి పెట్టవూ..." అంటూ తల్లిని ఆశ్రయించాడు.

"నిన్న సెలవు రోజంతా హాయిగా జల్సా చేసి ఇప్పుడు గుర్తొచ్చిందా నీకు... ఎప్పుడూ ఇదే వరస..."

"మమ్మీ.. ప్లీజ్ ఇవాళొక్క రోజుకి రాసిపెట్టు... రేపట్నుంచి నిజ్జంగా నేనే రాసేసుకుంటాను. రాయకుండా వెళితే టీచరు పనిష్మెంట్ ఇస్తారు మమ్మీ..." జాలి గొలుపుతూ గునిసేడు.

'పనిష్మెంటు' అనగానే కాత్యాయని కరిగిపోతుందని కనిపెట్టేశాడు భడవ.

"అలాగేలే.. వెళ్ళి తొందరగా స్నానం చేసి తయారవ్వు... వెళ్ళు..." అని వాడి చేతిలో కాపీ, పెన్సిలూ అందుకుంది కాత్యాయని.

మంచినీళ్ళు తాగుతున్న సుబ్బారావుకి పక్కున నవ్వొచ్చి పొలమారింది.

'ఆఁ.. ఆ నవ్వండి. తండ్రి పోలికే



కొడుకూను మీ కాపీలన్నీ రాసేను... ఇక వీడిని...'' అంది తనూ నవ్వుతూ.

లేచి డ్రెస్ వేసుకుంటున్న తన చిన్నప్పటి రోజుల్ని తలుచుకుని నవ్వుకుంటూనే స్టెత్ అందుకుని కారు స్టార్టు చేసి సాగిపోయాడు సుబ్బారావు.

భాస్కరంగాడి చూచికాపీ రాస్తూ అనుకుంది కాత్యాయిని, 'ఒక్కటే పోలిక, తండ్రిదీ కొడుకుదీ. చిన్నప్పుడు అచ్యుతం మేష్టారు రోజూ ఒకపేజీ దినచర్య మంచి దస్తూరితో రాసుకు రాకపోతే మండమీద కొట్టేవారు. సుబ్బారావు దెబ్బలు తప్పించుకుందికి తనకంటే నాలుగేళ్ళు చిన్నదాన్నయినా అందంగా అక్షరాలు రాస్తానని నన్ను ఉబ్బేసి బెల్లంపు అచ్చులూ, జామకాయలూ లంచం ఇచ్చి కాపీ రాయించుకొనేవాడు ''మరదలునే కదా రాసిపెట్టు...'' అంటూ అనుకుంది.

* * *

అదొక పెద్ద హాస్పటలు. అందులో పెద పెద్ద వార్డులూ, పెద్ద కాజువాలిటీ, పెద్ద డాక్టర్లూ, పెద్ద క్యూలూ అందులో పెద్ద జబ్బులూ వున్నాయి.

అయిదునిమిషాలు ఆలస్యంగా చేరిన సుబ్బారావు ఆదరాబాదరాగా సీట్లో కూర్చొని టేబుల్ పైనున్న బెల్ కొట్టి పేషంట్లని పంపమని సైగ చేసేడు. ఒకొక్కరే వచ్చి వెళుతున్నారు. అలా ఏడుగుర్ని చూసేడో లేదో...

'సార్... మీ కోసం ఒకావిడ వచ్చింది. వారికెవరికో సీరియస్సట. మీతో మాట్లాడాలంటోందావిడ' అన్నాడు వార్డు బాయ్.

అంతకు ముందు లేని అర్ధరూపాయ కాసు అతని జేబులో అందంగా మెరుస్తోంది.

'సరే రమ్మను' అన్నాడు విసుగ్గా.

పాతికేళ్ళ వయసుగల పావని పరుగు పరుగున వచ్చి 'సుబ్బారావుగారూ! మీరెప్పుడొస్తారోనని చూస్తున్నాను. మా వారికి సీరియస్‌గా వుంది వార్డులో వున్నారు, ఒక్కసారివచ్చి చూసి వెళ్ళండి' అంది. ఆమె కంఠం ఏడుపుని అదిమి పెట్టినట్టు బొంగురు పోయింది. చాలా సేపై ఏడ్చినట్టు కళ్ళు ఉబ్బి వున్నాయి. సుబ్బారావు విశ్వేష్ణుడై చటుక్కున లేచి నిలబడ్డాడు.

ఆమె సుబ్బారావు ఆప్తమిత్రుడైన సుదర్శన్ భార్య.

'అరెరె... ఏమయింది వాడికి! మొన్న బాగానే వున్నాడే!' అంటూ ఎదుటి సీట్లో బెంచీకి అటువైపు కూర్చున్న తోటి డాక్టరు సుందరావుకి చెప్పి ఆమె వెనక నడిచేడు.

క్యూలో రెండు గంటల నుంచీ నిలబడ్డ రోగులు అతనటు వెళ్ళగానే 'అంతేనండీ, గవర్నమెంటు డాక్టర్లూ, ఇలా వస్తారు అలా వెళిపోతారు. మనమెలా ఛస్తే వాళ్ళకేం' అనుకోడం సుబ్బారావు చెవిన పడినా అలవాటుగా దులిపేసుకుని ఆమెను వడివడిగా అనుసరించాడు. తోవలో జరిగిన సంగతంతా వివరిస్తోందామె.

''మొన్న కడుపునొప్పని మీ దగ్గిరకొచ్చి మందులు రాయించుకున్నారా? ... ఇంటి కొచ్చాక కొంచెం తగ్గిందిలే అని ఏ మందూ వేసుకోలేదు. మళ్ళీ నిన్న మధ్యాహ్నానికి కడుపునొప్పి వస్తే మొన్న తెమ్మనుకున్న మందులే సాయంత్రం వేసుకున్నారు. ఏమయిందో తెలియదు ఒకటే కళ్ళు తిరిగి పోవడం, నిలబడలేకుండా అయిపోయారు. ఆదివారం కదా మీరింట్లో వుంటారేమో నని వచ్చేను రిక్షాలో ... కానీ మీ ఇల్లు తాళం వేసుంది. అదే తగ్గిపోతుందిలే అని ఇంటి కొచ్చేసేము ఇంటికొచ్చాక కొంచెం హార్లిక్సు తాగి పడుకున్నారు. మళ్ళీ పొద్దుట లేచి మొహం కడుక్కుందికి పెరట్లో కెళ్ళేరు. అక్కడే కళ్ళు తిరిగి పడిపోయారు. ఒళ్ళంతా ఒకటే చమట... గుడ్లు పిడిచినట్లయిపోయారు. ఎలాగో ఇరుగూ పొరుగూ కలిసి రిక్షాలో హాస్పటల్‌కి తీసుకొచ్చి చూపిస్తే ఎడ్మిట్ చేసేరు. గంట నుంచీ ఎన్నిమందులూ ఇంజక్షన్లూ ఇచ్చినా కళ్ళు తెరవలేదు.'' అంటు కొంగు నోటి కడ్డుపెట్టుకుంది. ఎంత ఆపినా కన్నీరు ఆగకుండా ఆమె బుగ్గల్ని తడిపేస్తోంది. సుబ్బారావు వింటూనే లో చిమ్ముతున్నాడు.

'నిన్న ఆదివారం కదా అని ఎన్నాళ్ళ ముందో ప్లాన్ చేస్తున్న భీమ్లీకి పిక్నిక్కి వెళ్ళేరు. ఎంత పని జరిగింది. అవసరానికి స్నేహితుడికి అందకుండా అయిపోయింది. కొంపదీసి హార్టెటాక్ కాదు కదా!... ఈ రోజుల్లో వయసుతో ప్రమేయంలేకుండానే జబ్బులు ముంచుకొస్తున్నాయి...' అని బాధపడతూ సుబ్బారావు వార్డులోకి నడిచాడు.

బెడ్‌మీద అచేతన స్థితిలో నున్న సుదర్శనాన్ని చూసేసరికి కళ్ళలో నీళ్ళు నిండేయి సుబ్బారావుకి. ఇంతప్పట్నించీ కలిసి ఆటపాటలాడిన బాల్యమిత్రుడు అంతిమఘడియల్లో వున్నాడనే సరికి ఎంత బండబారిన గుండె అయినా కరిగి నీరవక మానదు కదా!

చుట్టూ హౌస్‌సర్జన్లూ, డ్యూటీ డాక్టర్లూ తను శక్తివంచన లేకుండా ప్రయత్నాలు చేస్తున్నారు. ముక్కుకి ఆక్సిజన్ తగిలించి వుంది.

'మొన్న నవ్వుతూ వచ్చి మందులు పట్టుకెళినవాడు. ఇంతలోకే ఏమయ్యింది?'






అని ఆలోచిస్తూ కేషీటు అందుకుని రిపోర్టులు తిరగేశాడు సుబ్బారావు.

ఇ. సి. జి. ఎక్స్‌రే అన్ని టెస్టుల రిపోర్టులూ నిదానంగా పరిశీలించాడు. ఎందులోనూ లోపం కనబడలేదు. యూరిన్, బ్లడ్ రిపోర్టు లింకా రాలేదు. పేషంటుకి స్పృహ లేదు— కోమాలో వున్నాడు. హార్టు చాలా నీరసంగా కొట్టుకుంటోంది. ఘడియో... క్షణమో!

వరండాలో సుదర్శన్ తల్లి, ముసలి

తండ్రి, పావని ఆత్రుతగా అతని వైపే చూస్తున్నారు వారిని ఊరడించడం తన కనీస కర్తవ్యంగా తోచి అటు నడిచాడు సుబ్బారావు.

అతని రెండు చేతులూ పుచ్చుకుని సుదర్శన్ తల్లి,

"బాబూ నువ్వూ, మా వాడూ ఒకే ప్రాణంగా పెరిగేరు ఎలాగైనా వాడిని కాపాడు. ఈ పిల్లల గతి ఏం కాను?" అంది ఏడుస్తూ. ఆ పూర్కనే వున్న సుదర్శన్ బావమరిది పావని ఇద్దరి పిల్లల్ని అక్కున జేర్చుకుని దూరంగా నిలబడి కళ్ళు తుడుచుకుంటున్నారు.

సుబ్బారావుకి మనసు కలచివేసినట్లయిపోయింది 'వైద్యశాస్త్రం' చేతిలో వుండి ఏమీ చెయ్యలేని పరిస్థితి మొన్న కడుపునొప్పని వస్తే అన్ని పరీక్షలూ చేసి మామూలు కడుపు నొప్పేనని నిర్ధారణ చేసి డైవాల్ తీసుకోమని రాసేనే! ఆ విసిడిటీకి వచ్చిన కడుపు నొప్పివల్ల ఇంత ప్రమాదం రావడానికి వీలేదు. డైవాల్‌వల్ల ఇంత ప్రమాదం వచ్చే అవకాశాలు తక్కువ. మరి ..' ఒక్క మెరుపు మెరిసింది సుబ్బారావు మెదడులో.

పావనివైపు తిరిగి, "మొన్న నేరాసిచ్చిన మందులు తెచ్చేరా?" అన్నాడు ఆమె తలవూపి తన హేండ్ బేగ్‌లోంచి మందుల స్ట్రిప్‌తో పాటు అతను రాసిన చీటీకూడా తీసి సుబ్బారావు కందించింది. వాటిని అరక్షణం పరికించి, పరుగు లాంటి నడకతో అందర్నీ తోసుకుంటూ సుదర్శన్‌ని చేరుకున్నాడు. క్షణంలో కర్తవ్యం ఆలోచించాడు. ఇవ్వవలసిన ఇంజక్షన్ ఎక్కించడానికి సిరెంజ్ తెచ్చిన కొలీగ్ చేతిలోంచి సిరెంజ్ లాక్కొని మందుల బీరువా వైపు పరుగు పరుగున చేరుకుని, గ్లూకోజ్ నింపి సుదర్శన్ వైన్‌లోకి ఎక్కించాడు. అయినా భయం తగ్గక మళ్ళీ సిస్టర్స్ టీ కలుపుకొందికి గదిలో హీటరు వెనుక పెట్టుకొన్న పంచదార సీసాలోంచి దోశెడు తీసి కప్పుడు నీళ్ళల్లో వేసి కలిపి మెల్లగా సుదర్శన్ గొంతులో పోయసాగేడు. మిగిలిన వాళ్ళు అతని చర్యకి ఆశ్చర్యపడుతూ...

'వాట్...డాక్టర్ ... వాటార్యూ డూయింగ్ ?' అని ప్రశ్నించారు. అతను ఎవరికీ జవాబు చెప్పలేదు. అతనిధ్యేయం ఒక్కటే. సుదర్శన్ బ్రతకాలి—

మరి కాస్సేపటిలో అతని శ్రమ ఫలించింది అందరూ ఆశ్చర్యపోయేలా సుదర్శన్ లేచి కూర్చున్నాడు. పావని కళ్ళలో కృతజ్ఞత సముద్రంలా పొంగి సుబ్బారావుని అవమానంలో ముంచేసింది!

* * *

సుదర్శన్ లేచి కూర్చోగానే సంతోషంగా అతనికి షేక్‌హాండిచ్చి చెమటైనా తుడుచుకోకుండా ఫార్మసిస్టు గదివైపు నడిచేడు.

విషయం విని ఫార్మసిస్టు మొహం నల్లగా మాడిపోయింది.

క్షమించండి సార్.. నేను 'డైవాల్'కి 'డావనిల్' అనుకొని ఇచ్చేశాను. 'ఎంత పొరపాటు జరిగిపోయింది' అన్నాడు చేతులు నులుపుకుంటూ.

"డయబిటిస్ - పేషంటుకిస్తే మందు మామూలువాడికిస్తే హైపోగ్లైసీమియా రాక ఏంచేస్తుంది? నేను అతనిది "హైపో గ్లైసిమిక్ కోమా" అని గ్రహించడానికి అర నిముషం ఆలస్యం చేస్తే సుదర్శన్ ఈపాటికి మరో లోకంలో వుండును. ఒక నిండు ప్రాణం తీసినవాళ్ళ మవుదుం. ఎవరికీ ఈ విషయం తెలియదు కాబట్టి సరిపోయింది. లేకపోతే రేపీపాటికి నీ ఉద్యోగం ఊడిపోను...కాస్త ఒళ్ళు దగ్గిర పెట్టుకుని మందులివ్వు." అని ఫార్మసిస్టు మీద ఎగిరిపడి ఉస్సురంటూ ఇల్లు చేరాడు సుబ్బారావు.

* * *

మర్నాడు సాయంత్రం భాస్కరాన్ని దగ్గిర కూర్చోపెట్టుకుని అక్షరాలు దిద్దిస్తూ... తనుకూడా ఒక కాపీలో రాస్తున్నాడు దీక్షగా.

కాఫీ కప్పుతో గదిలో ప్రవేశించిన కాత్యాయని భర్త బుద్ధిగా కూర్చుని అక్షరాలు దిద్దడం చూసి పకపకా నవ్వి...

"డాక్టరుగారు తీరికగా కూచుని ఎ. బి. సి. డి. లు దిద్దుకుంటున్నారేం? పాపం బాల్యం విడనాడాలని లేదా? నోట్లో వేలు పెట్టుకు చీకలేదు ఇంకా నయం..." అంది పడి పడి నవ్వుతూ. భాస్కరానికి తండ్రి తనతోపాటు అక్షరాలు దిద్దడం అద్భుతంగా వుంది. తల్లి నవ్వుకి తన నవ్వు జోడించాడు సంతోషంతో. కానీ సుబ్బారావు నవ్వలేదు, నిన్న తన హేండ్ రైటింగ్ అర్థం కాక డైవాల్‌కి బదులుగా డావనిల్ ఇచ్చిన ఫార్మసిస్టు తప్పులో తనదీ కొంత భాగం వుంది. తప్పెవరిదైనా 'పనిష్మెంట్' పేషంట్లకే కదా!

"కాత్యాయనీ... అక్షరాలు దిద్దడమే కాదు, ఇప్పుడు అచ్యుతం మేష్టారు కనబడితే బెత్తం ఆయన చేతికిచ్చి చెవులు పట్టుకు గోడకుర్చీ వేస్తాను" అన్నాడు బాధగా.

**అంకితం**

రాబోయే డాక్టర్లకీ, యాక్టర్లకీ, కలెక్టర్లకీ, మినిష్టర్లకీ, ఏక ధ్యేయంతో అక్షరాలు అందంగా దిద్దించే మేష్టర్లకే ఈ కథ అంకితం.







VEP
VEP





